# ప్రసన్నయాదవనాటకము.



ఇది

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిచే

రచియింపఁబడినది.



తొమ్మిదవకూర్పు 2,000

రాజమహేంద్రవరము.

మట్టే సుబ్బారావుగారిచే

యస్. గున్నేశ్వరరావుబ్రదర్సువారి

శ్రీ చింతామణిముద్రాక్షరశాలయందు ముద్రింపించి

ప్రచురింపఁబడియె.

1923



వెల రు. 0—8—0

## ఈ నాటకమునందు వచ్చు పాత్రలు

### పురుషులు.

మహేంద్రుఁడు—దేవతల రాజు.

బృహస్పతి—దేవగురువు.

జయంతుఁడు—మహేంద్రుని కుమారుఁడు.

మాణిభద్రుఁడు—కుబేరుని సేవకుఁడు.

నరకాసురుఁడు—ప్రాగ్జ్యోతిషాధిపతియగు రాక్షసరాజు.

పంచజనుఁడు, నిశుంభుఁడు, మురుఁడు—నరకాసురుని సేనాధిపతులు.

వజ్రకంఠుఁడు, మందపాలుఁడు—నరకాసురుని బంట్లు.

సూతుఁడు—నరకుని సారథి.

భగదత్తుఁడు—నరకాసురుని కుమారుఁడు.

శంబరుఁడు—నరకాసురుని మంత్రి.

శుక్రాచార్యులు—రాక్షసగురువు.

చిత్రరథుఁడు—గంధర్వుఁడు.

పులహుఁడు, బృహదశ్వుఁడు—బదరికాశ్రమమునులు.

దారుకుఁడు—కృష్ణుని సూతుఁడు.

దేవలుఁడు—కృష్ణుని యంతఃపురపరిచారకుఁడు.

శ్రీకృష్ణుఁడు—కథానాయకుఁడు.

### స్త్రీలు.

ఊర్వశి—స్వర్గలోకవేశ్యకాంత.

సత్యభామ—శ్రీకృష్ణుని దేవి.



శ్రీ

# ప్రసన్నయాదవ నాటకము.



## ప్రథమాంకము.

### నాంది

మ. మును లాస్థానకవీంద్రు ; లాగమచయంబుల్ వందిబృందంబు ; స
జ్జనచిత్తంబులు కొల్వుకూటములు ; సందర్భంబు ల్గానాగారము
ల్మనుజుల్ సేసెడిసేవ యప్పనము ; బ్రహ్మాండంబు సామ్రాజ్య మె
వ్వని కా నాదిమచక్రవర్తి కృపఁ గాపాడు సభ్యోత్తములన్. 1

మఱియు

తే. గీ. ప్రాణికోటుల నెల్లఁ బాత్రములఁ జేసి
జగ మనెడు మహారంగ దేశంబునందు
నాటకంబుల నేర్పుతో నడుపునట్టి
సూత్రధారుండు మిముఁ బ్రోచు శుభము లొసఁగి. 2

సూత్రధారుఁడు—(నాంద్యనంతరమున తెరవంకఁ జూచి) పారిపార్శ్వకా! నీ వొకసారి యిటు రాఁగలవా ?

పారిపార్శ్వకుఁడు—(ప్రవేశించి) అయ్యా ! ఇదిగో వచ్చుచున్నాఁడను. నే నేమి చేయవలసియున్నది ?

సూత్రి—ఓయీ ! సాయంకాలమునుండి ప్రయత్నము చేయుచున్నాను నీ విప్పటికిని రంగకృత్యమును సిద్ధము చేయలేక పోతివా ?

పారి—అయ్యా ! మీరు నిష్కారణముగా నాపై నేరము మోపుచున్నారు. అంతయు నీవఱకే సిద్ధమయి యున్నయది. సభాసదులతో మనము ప్రయోగింపఁబోవు రూపకమును గూర్చి మీరు చెప్పవలసినది చెప్పక పోవుటయే యాలస్యము.

సూత్రి—ఏమీ ! నాదే యాలస్యమా ? అటయిన నిదిగో చెప్పుచున్నాఁడను. రసికశిఖామణులగు నో సభాసదులారా ! విద్వజ్జనవిధేయుఁడగు బ్రహ్మశ్రీ ఓలకమఱ్ఱి

లక్ష్మీనరసింహకవిచేత నాంధ్రభాషలో రచియింపఁబడిన ప్రసన్న యాదవ మను వీరరస ప్రధానరూపకమును, మే మీరాత్రి యిచ్చటఁ బ్రయోగింపఁ దలఁచుకొన్నారము. కావున మీరు సావధానులరయి చిత్తగింతురుగాక !

పారి—అయ్యా ! ఈనాటకకవిగుణాగుణంబులఁ గూర్చి యించుకేనియుఁ జెప్పనైతివేమి ?

సూత్ర—దానిఁగూర్చి చెప్పఁదగినవాఁడను నేను గాను.

మ. కవి పోన్నారి, కృతు లన్నగ, ల్యర్థ మె బంగారంబు, శ్లేషాది స
త్కవనంబు ల్నగిషీపను, ల్లసదలంకారంబు లుద్యన్మణీ
నివహంబు ; స్కృతి మెచ్చ యెట్టిదియొ, త న్నిర్మాణ నేర్పెట్టిదో
వివరింపందగు నాణెకాండ్రు గద ! యుర్విన్ బండితగ్రామణుల్. 3

పారి—ప్రబంధ మెట్లున్నను బ్రయోగకుశలుల మగు మనము సభాసదుల రంజింపఁ జేయఁగలమని నేఁ దలంచెద.

సూత్రి—ఓపండితంమన్యా ! గర్వోక్తులతో నేమి ప్రయోజనము ?

క. తనరూపము, తనవిద్యయుఁ
దన నేర్పును దనగుణంబు దనగానము, గ
న్గొని యొవఁడు సంతసింపఁడు ?
తనవిషయము నెంచ నోరులె తగువారుసుమీ ! 4

మఱియు నీ వనినట్లు మనము ప్రయోగకుశలులమే యయ్యును నంతమాత్రమున సభాసదులు సంతసిల్లరు. ఏమనిన—

చ. కృతి రసవంతమయ్యు మది కింపొనఁగూర్పదు నాటకు ల్సమ
ర్థత మెయి నాడకుండినఁ; బ్రదర్శకు లెల్లఁ బ్రయోగపద్ధతి
న్నతురులె యైన నేమి కృతి చప్పని దైనపు; డాప్రయోగము
న్గృతియును మంచివైనపుడె నిండుమనం బగుఁ జూచువారికిన్. 5

పారి—అట్లయిన గ్రంథదముత్కృతియుఁ బ్రదర్శకులసామర్థ్యమ్ముఁ గనిపెట్టుటకు, సభాసదులుమాత్రము నేర్పరులయి యుండవలదా ?

సూత్రి—ఓయీ ! ఇటు వినుము ?

తే. గీ. కవియు నాటకు ల్నేర్పరు లౌవలయును
సభ్యు లగువార లెప్పుడు చతురమతులె
వంటకత్తియ జాణ గావలయుఁ గాక !
తినెడువారికిఁ దద్రుచు లెలియవన్నొ ? 6

# ప్రథమాంకము.

పారి — సరే! చతురమతులయిన సభాసదులందఱు కావ్యమునందును మన ప్రయోగమునందును గల గుణమ్ములు గ్రహించి యానందింతురుగాక!

సూత్రి — గుణగ్రహణపారీణులే యట్లు చేయుదురు. తదితరులు దోషాన్వేషణముఁ జేయుచుందురు. అయినను నీ నాటకమును బ్రయోగించునప్పుడెల్ల సభాస్తారులతో నిట్లు మనవిచేయుమని కవి యానతిచ్చియున్నాఁడు.

తే. గీ. సత్కవి యొసఁగు కావ్యంబు సరసువోలె
స్వచ్ఛమై రసవంతమై సౌఖ్యద మగుఁ
గుకవులధీవరు లరసముల్ గ్రోలలేక
నీచగతి విచారమునకై నెమకికొందురు.

మఱియు

తే. గీ. శ్రీపురాణపండితకులాబ్ధి శీతకరుఁడు
సరసుఁ డాంధ్రగీర్వాణభాషావిదుండు
మల్లయాఖ్యుండు నా మేనమామ యగుటఁ
గవిత రచియించె నీకృతి గణుతిఁ గాంచు.

పారి - అయ్యా! నీవు సభాసదులతోఁ జెప్పవలసిన సంగతులు చెప్పితివి గనుక నేనికఁ నాటకప్రయోగమున కారంభించెదను.

సూత్రి — వేషము లన్నియు సిద్ధము చేసితివా?

పారి — సిద్ధమయి యెంతసేపయినది? అదిగో! మనమిత్రుఁడు మహేంద్రుని వేషము వైచికొని మహావైభవముతోఁ గొలువుండుటకు సిద్ధపడియున్నాఁడు.

సూత్రి — (చూచి) ఔనౌను. ఈసభాసదులతో నొక్కమాట మనవిచేసి పోవుదము. ఓసదస్యులారా!

మ. అమరాధీశునికొల్వుఁ జూచి యటుపై నాత్యద్భుతంబౌ నా
ట్యము లాలించి సుఖించి, ద్వారకను సత్యాపద్మగంధీ సమే
తు మురారాతినిఁ గాంచి, మీఁద హరి దైత్యుల్ పోరు సంగ్రామ మ
ధ్యమునం దించుక నిల్చి, మీ మనసు లత్యానందమున్ గాంచుత 3

(అని యిద్దఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రస్తావన.

# ప్రసన్నయాదవ నాటకము.

———:)o(:———

## ప్రథమాంకము.

———

రంగము—ఇంద్రసభ.

[అప్పుడు పీఠములమీఁద గూర్చుండి మహేంద్రుఁడు, బృహస్పతి, జయంతుఁడుఁ బ్రవేశించుచున్నారు]

మహేం—(విచారముతో నిట్టూర్పు విడిచి) ఆచార్యా!

చ. పొడవడఁగెన్ హిరణ్యకశిపుండు, గతించెను దారకాసురుం
డడఁగెఁ గథావశేషుఁడయి యాపశికంఠుఁడు, మాకిఁకన్ భయం
బుడిగె నటంచు నీత్రిదివముద్ధృతదానవకంటకంబ యయ్యెడుఁగదయంచు నేఁ దలఁచ నీనరకుం డెటనుండి వచ్చెనో. 1

బృహ—మహేంద్రా! ఎటనుండి వచ్చెనో యన నేల? పద్మగర్భుని యవివేకమునుండియు మన మందభాగ్యమునుండియు—

ఆ. వె. మొదలఁ జేసినాఁడు పిదప దైత్యుతపంబు
మెచ్చినాఁడు వరము లిచ్చినాఁడు
వేల్పుఁబెద్ద యనుచుఁ బేరు పెద్దయె కాని
యతఁడ చేసె మనకు నధికహాని. 2

మహేం—పద్మగర్భునినిందించుటకన్న మనభాగధేయమును మాఱుటయు క్తము నేఁ జేసినదోస మేమోకాని యీ నాపరిపాలనము దినదినగండము వేయేండ్లాయు వన్నట్టు లున్నది. ఒక నాఁటి పరితాపము గాదు. మూఁడు జగంబులకు నేకచ్ఛత్రాధిపత్యంబు వహించి ముప్పదిమూఁడుకోటులదివ్యులకు నాయకుఁడ నయిన నేను క్షణక్షణము ననురక్షితచే గుండెలు చేతఁ బట్టుకొనియుంటఁ జూడ నాలోనాకే సిగ్గగుచున్నది. అనవరత చిత్తసంక్షోభకారణ మయిన యీసామ్రాజ్యంబు నేలుటకన్న నిరపాయంబును, నివృత్తసకలలౌకికవ్యాపారంబును, నిర్మనస్తాపమును నగు మునివృత్తిఁ బూని నారాయణుచరణంబు శరణంబుగాఁ గానలనుంట సముచితం బని తోఁచుచున్నది. అమరపక్షపాతియగు నబ్జనాభుం డెన్నెన్ని యవతారంబు లెత్తి యెంత యెందఱ దైత్యులం దునిమినను నిర్జరుల భాగ్యదోషమున వారికులంబులు తామర తంపరలయి నానాఁట నభివృద్ధిఁ జెంది యినుకపాతరలట్లు తఱుగకున్నవి పాపనిరతంబును, గుణరహితంబును నగు నా యధమదానవానీకంబునకు వంగివంగి జోహారు

లోనర్పలేక, యొదిఁగియొదిఁగి యుండలేక, సపర్యలు సలుపలేక, విసిగిపోవుచుంటివి. ఈనరకాసురుండు మున్ను ద్రవమున సోమకునికన్నఁ, గ్రౌర్యంబునఁ దారకునికన్న, మగఁటిమి హిరణ్యకశిపునికన్నఁ, బరకాంతాసక్తి రావణునికన్న, మిన్నయఁట. విశేషించి లోకభయంకరుండు మురుఁడును, దుష్కారారంభుండు నిశుంభుండును, క్రూరస్వభావుండు హయగ్రీవుండును, శౌర్యధనుండు పంచజనుండును వానికిం బాసటయాయి వచ్చి నాలుగుభుజంబు లట్లుపచరింతురు. ఇంతకు నాపైఁ బెరిగిన మనబలంబుగతి యేమి యయ్యెనో తెలియదయ్యె. నేఁ డదియేమోకాని నూరజనసులభ మగు నుత్సాహము నాహృదయమున నెలకొని యుండలేదు. నామనస్సు పరాజయము నే శంకించుచున్నది.

బృహ — మహేంద్రా! వెఱవ నేటికి ?

తే. గీ. మూఁడుదలఁచిన మేల్కీళ్ళు నిజ లట్లు
ధృతియు భీతియుఁ బొడసూపు హృదయమునందు
సాధుజనములు వానిని సూచన లెఱింగి
భావిగతుల బుద్ధిని నెంచి పని యొనర్తురి. 3

వెఱచినమాత్రమున నాపదలు దూరమునకుఁ బోవు. ధైర్యమూనిన నవి సమీపమునకు రావు. వగచి చేయునది లేదు. కావున నుదారపురుషలక్షణ మగుధైర్యము విడిచి యుండరాదు.

జయం — ఆచార్యా! అమరేశ్వరుని కింతవెఱఁగుపాటుఁ గలిగించు నాదైత్యుఁ డెవ్వరికుమారుఁడు ? ఏమిమహిమవాఁడు ? ఈ యుదంతము మాకుఁ గింపఁబోలునేని నా కెఱిఁగింప వేఁడెదను.

బృహ — వత్సా! ఎఱిఁగింపరానిదేమి ? నే నెప్పెద వినుము. వినియుండుదు వనదా! తొల్లి భువనకంటకుఁ డగుహిరణ్యాక్షుఁ డను దానవకులసార్వభౌముఁడు కలఁ డని. అతఁడు తనమగంటిమి నిర్జరుల కజేయుఁడై భూమిదేవిని సిలుగులఁ బెట్టె నాకారణమున ననవరతము దేవపక్షపాతి యగునారాయణుండు శ్వేతవారాహమూర్తి యా రక్కసునిఁ బరిమార్చి భూమిదేవిని నుద్ధరించి తనకొమ్మున ధరియించి బుజ్జగించె. అప్పుడు పురుషప్రవృత్తి మునకును భగవతి యగువసుంధరకును నరకుఁడు జన్మించె. పదపడి వాఁడు తపోవిశేషమున వారిజాసనుని మెప్పించి వరములఁ బడసి ముల్లోకంబు జయించి దివమును జొచ్చి యిప్పుడు మనకు వెఱపుఁగొలుపునంతవాఁ డయ్యె.

జయం — (ఆశ్చర్యముతో) ఏమి ? భువనరక్షణపరాయణుఁ డగు నారాయణునకు సుతుఁడు, విశ్వహితకారిణి యగుధారుణికిని నుదయించిన నందనుఁడో యితఁడు ? ఈతఁడు నింద్యకర్మములకు వెనుదీయనిరక్కసుఁ డెట్లయ్యెను ?

బృహ—కుమారా! ఆశ్చర్య మేల? చూడుము.

తే. గీ. నిఖిలజనులకుఁ జల్లనినీడ నిచ్చు
వృక్షశాఖలు రాపాడు వేళలందు
పొడము నగ్నికణము కాల్చునడవు లెల్ల
జన్మభూమితో నేమి యసాధువులకు. 4

మహేం—కుమారా! అది యట్టిదే. చూడుము.

తే. గీ. జలదములనుండి పిడుగులు జాఱునట్లు
మంచివారికి ఖలులు జనించుచుండ్రి
మంటిలో నుద్భవించెడు మణులట్లు
ఖలులకడుపున నుత్తముల్ గలుగుచుంద్రు. 5

జయం—ఆర్యా! మీరు సెలవిచ్చినదంతయు నిశ్చయము. దానవకులక్రమాగతం బగుకాఠిన్యమునకుఁ దోడు రణధైర్యంబునను నృపతిమాత్రప్రతాపంబునను వాఁడు క్రమంబునఁ దల్లిదండ్రులఁబోలి పుట్టెఁ గావున నతఁడు నిర్జరులకజేయుఁడని తోఁచుచున్నది; యుద్ధవార్త దెలుపుటకు సమరరంగంబునుండి యింతవఱకు మన భటుం డొక్కఁడు రాకుండుటకుఁ గారణ మేమయి యుండును?

బృహ—అదిగో నెవ్వరో యిటు వచ్చుచున్నారు. (పోల్చిచూచి) కుబేరపరిజనుఁ డగుమాణిభద్రుఁడు.

మహేం—ఈతఁ డేమివార్త చెప్పనోకద! ముఖవైఖరి కీడును సూచించెడును.

[అప్పుడు మాణిభద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మాణి—(తనలో) కటకటా! నేను మిక్కిలి మందభాగ్యుఁడను. ఈశ్రవణకఠోర మగువార్త మహేంద్రునకు నే నెట్లు విన్నవింతును? అయినను స్వామి యగు కుబేరుని నియోగము నడుపక తప్పదు కదా!

చ. అనుపమధర్మమార్గపరులైన సుపర్వులు పాఱుచుండ దు
ర్జనులు కృపావిహీనులును రక్కసు లాజి జయంబు గాంచుటల్
గనుఁగొన ధర్మమే జయముగాంచెడు నంట యబద్ధ మంచునున్
ఘనభుజసారమే విజయకారణ మంచును నేఁ దలంచెదన్. 6

(ప్రకాశముగా) రక్షింపుము. రక్షింపుము. త్రిలోకాధినాథా! (అని పాదములమీఁదఁ బడుచున్నాఁడు.)

మహేం—(సంభ్రమముతో) ఓయీ! ఏమి మూడినది? దేవసేనల పరాజయ మెఱిఁగింప వచ్చితివా?

బృహ—నాకలోకము మ్రిక్కిడిరక్కసులపా లయినదా?

జయం—దేవకాంతల యదృష్టములు విపరీతములై యయ్యెనా?

మాణి—(లేచి) దేవా! మందభాగ్యుఁడ నైన నేను దేవరకు దేవసేనల విజయ మంగళవార్తలు దెలుప నోఁచుకొననైతిని.

మహేం—ఆదేవాసురసమరము మన కశుభపరిణామ మెట్లయ్యెనో సంగ్రహముగా మా కెఱింగింపుము. కాలోచితముగ వలయు ప్రతిక్రియ యొనర్చుకొందము.

మాణి—(అంజలి పట్టి) దేవరవా రవధరింతురుగాక! ఆవిధమున ముర, నికుంభ, పంచజన, హయగ్రీవ సమధిష్ఠితంబు లయి దైత్యదానవానీకంబులు లోకంబులు మ్రింగు లాగున నార్చుచుఁ జేర్చి నిల్చిన, యమ, యాదఃపాల, దహన, ధనద, పవన, పశుపతి ప్రముఖు లగుదిక్పాలకులు వేలుపుమూఁకలం గూర్చుకొని యరదంబులు, ద్విరదంబులు, బాణంబులు, తూణంబులు, హయంబులు, భటనిచయంబులు, నాయత్తంబు గావించుకొని మొగ్గరంబులు పన్ని యెదుర్కొనుటయు నుభయబలంబులు నోహరిసాహరిఁ బెనఁగి సమరం బొనర్చె. అప్పుడు నిర్జరసైన్యారణ్యంబుపయిఁ గాఱుచిచ్చువచ్చిన దైత్యనాయకుఁడు పెచ్చుపెరిఁగి,

సీ. కఱకుఁగత్తులఁ బూని కౌబేరబలములఁ బెఱకుఁగట్టల నట్లు నఱికినాఁడు
యఱకాలఁ బెలరేఁగి యగ్నిదేవునిమూఁక సన్నచీమల నట్లు చమిరినాఁడు
గుదియ చేతనుఁ బూని కదిసి వారుణసేన నాలమందల నట్లు తోలినాఁడు
శరపరంపరలేసి జముబంట్లమేనులు చించి జల్లెడ లట్లు చేసినాఁడు
క్రొవ్వులులఁబోలు దైత్యులకొత్తలఁ జెడి
వేల్పు లలమేఁకలటుపాఱి విఱుఁగవలసె
దిక్కు లేనివార లోదివిజనాథ!
దిక్కుమాలినవార లై తిరుగవలసె. 7

మఱియు సేనలు పోయినపోకగాఁ దిరిగి చూడక చనుటయు,

తే. గీ. మన కృశానుని తేజంబు మంటఁ గలసె,
నాఁటి వరుణదేవునిశక్తి నీటఁ గలసె,
నెచటికో వాయుబలమెల్ల నెగిరిపోయెఁ,
జిక్కి నగ మయ్యె నీశానుఁ డుక్కు దక్కి. 8

తూలంబులం గాల్చు నీ కీలంబులు దనుజాలకపుంజ ప్రకరణజాలంబులయి తోఁచెనే? ఓయీ నైరృతా! 'వజ్రం వజ్రేణభిద్యతే' యన్నట్లు మాయాబలాభిశోభితు లగుదానవులను దానవాంశమునఁ బొడమిన నీవు నిర్జింతు వని కొంతయాశతో నుంటిమి. అదియు వమ్మయ్యె. మిత్రమా! కుబేరా! నిగ్రహానుగ్రహసమర్థుఁ డగుభగవానుఁడు కాలకంధరుఁడు నీకు సంగడికాఁడై నినుఁ గాచుచున్నను నీ కీపాటులు దప్పవయ్యెను.

ఆ. వె. నరకుఁ జెంతవాఁడు నారాయణుఁడు తోడు
మదనవైరి తోడు మన కటంచుఁ
జింత దక్కియుండఁ జెట్టి లింతలు పుట్టె
నుక్కుమేడఁ గాల్చె లక్కనీల. 11

జయం—అన్నా! మిక్కిలి యధైర్యము వడియెద వేల? ఆపత్సమయంబున ధీరు లనుసరింపఁదగినమార్గ మనుసరింపుఁడు

మాణి—మహేంద్రా! ఊరక యధైర్యమునకు లోను చేయుదువు? ఇంకను నావిధియింపవలసిన దించుక కలదు. నేను చెప్పునది సాంగముగా విని సముచితోపాయముగా నెయ్యది కర్తవ్యమో దాని నొనర్తురు గాక!

మహేం—అట్లయిన నీవు చెప్పవలసినదంతయుఁ జెప్పుము వినుచున్నాఁడను.

మాణి—పిమ్మట యక్షేశ్వరుఁడగు కుబేరుఁడు రణరంగమునుండి తొలఁగి తన హయముపైఁ గూరుచుండి పరుగిడుచు మార్గాయాసముచేత వగర్చుచు నెంతయుఁ గష్టమున నన్నుఁజేరి తమ కిట్లు సందేశ మంపె. "త్రిలోకాధినాథా!"

చ. నే నిటు లైతి; నాజి రజనీచరనాథుఁడై గెల్చె; వాయు, వై
శ్వానరముఖ్యులుం దొలఁగి పోఁజిరి, కాంచఁ గదయ్య నందనో
ద్యానము, నంగనాతతి, సుధాకలశంబును, పారిజాతసం
తానముఖామరద్రుమవితానమును, న్మన కామధేనువున్. 12

మహేం—మిత్రమా! కుబేర! ఆపత్సమయమునందును స్వామిహితమును మఱువని నీచరిత్రము శ్లాఘాపాత్రము. ఓయీ! మాణిభద్ర! అట్లయిన నిప్పుడు రాక్షసేంద్రుని యుద్యమ మేమి?

మాణి—దేవా! దురాత్ము లయినశాత్రవులు జయమొందినపుడు పరాజితు లయిన పగతుర నేమి సేయుదురో యదియే వాని యుద్యమము.

బృహ—అది యేమో తేటతెల్లముగా నెఱింగింపుము.

మాణి—దానవబలంబులు దేవబలంబులను మాఱుమూడి వెన్నంటి తఱుముచుండ మేఘగంభీరభీషణంబు లగుభాషణంబులతో రాక్షసరాజు తనబలంబుల కిట్లనియానతిచ్చె.

ఆ. వె. పూలతోఁట లనక పుణ్యభూము లనక
రాచనగరు లనక రచ్చ లనక
వేల్పుఁబ్రోలు సొచ్చి వీరదానవులార!
కొంకు జంకు లేక కొల్లఁగొనరొ. 13

బృహ——అట్లయిన మనము మనజాగరూకతనిఁక నుండవలయును.

మహేం——అమ్మా! ఎయ్యది యీయవసరమం దాచరణీయమో యెయ్యది యనాచరణీయమో నే నెఱుఁగఁజాలకున్నవాఁడ. మనసేన యున్న తెఱఁగును రాక్షసుల యున్న తెఱఁగును విన నామనమున సమరసన్నాహనోత్సాహంబు డిందుపడినది. త్రిదివంబు విడిచి పోవుదమన్న పరిజనంబులు పడునగచాట్లు దలంపునకు వచ్చి నన్నుఁ గాలు గదపనీయవు. దానవు నెదుర్కొందమన్న వానినోర్పు టరిది. కావున నిప్పుడు నే నేమార్గ మవలంబింపవలయునో మీరు నిర్ణయింపవలయును.

(తెరలో)

ఓహో! సిద్ధ, సాధ్య, విద్యాధర, గంధర్వ, యక్ష, కిన్నర, ఖేచరులారా! త్రిలోకాధినాథుఁ డగుమహేంద్రుఁ డెందున్నవాఁడు? ప్రాగ్జ్యోతిషాధినాథుఁ డగుదానవేశ్వరుఁ డాతని దర్శనము చేయవచ్చినాఁడు. కావున నాతఁ డున్నతా వెఱిఁగింపుఁడు.

బృహ——(ఆలకించి) కడమపని చేయుటకు రాక్షసాధముఁ డిదిగో నీదెసకే వచ్చినాఁడు.

మహేం——ఆచార్య! ఆచార్య! కర్తవ్యము? కర్తవ్యము?

జయం——అంతఃపురరక్షణ మవశ్యకర్తవ్యము.

బృహ——మహేంద్రా!

ఆ. వె. శౌర్యశక్తి దలఁపఁ జనక యుండుట మేలు
శత్రుధాటి దలఁపఁ జనుట మేలు
రెండు పోల్చిచూడ నొండెరక్కసునకు
సకల మిచ్చి చనుట చాల మేలు. 14

మహేం——అట్లయిన స్త్రీలగతి యేమి? తక్కుంగలవారలగతి యేమి?

సీ. కనఁబడ్డసతి నెల్లఁ గవయఁజూచెడునీచు గారవించునె వేల్పుఁ గన్నియలను?
మా పేరు వినినంత మండిపడెడుదాయి ముద్దుసేయునె నాదుపుత్రికలను?
స్వర్గమంతయుఁ బాడుసలుప నెంచెడుకూళ విడిచిపోవునె కల్పవృక్షములను?
మునియాగపశువుల ముచ్చిలించెడుపాపి యపహరింపఁడె వేల్పుటావు నకట!
కరుణ యెట్టిదో యెఱుఁగని కటికచెనఁటి
బ్రతుకనిచ్చునె యింక నైరావతమును?

ముజ్జగంబులవారి కింత మూఁడు ననుచు
నించుకేనియుఁ గలనేని నెఱుఁగనైతి 15

బృహ—వాఁ డెంతఘాతుకకర్ముఁ డయిన నొనర్చుటకు సంకోచింపఁడు. కావున నచ్చరలను దక్షుఁగల యియచ్చరాంగనలను మేరుపర్వతగుహలకుఁ దోడ్కొని పొమ్మని జయంతకుమారు సంప్రేష యుచితము. అమృతభాండమును గాపుగవియు వారలతోఁ బోవుగాక!

మహేం—అట్లయిన నింక జాగొనరించిన ప్రయోజన మేమి? వత్సా! జయంతా!

చ. త్రిదయుకు మున్న దానవకదంబము సేరకమున్న వేలుపుం
బడఁతులతోడ మీ జననిఁ భద్రముగాఁ గొనిపోఁ గదన్న కా
ఱడవులకైనఁ బర్వతగుహాంతరభూములకైనఁ జెచ్చెర
న్గడువఁగఁ గొంతకాల మిటఁ గ్రమ్మఱవత్తురుగాక యుంచుచున్. 16

శచీయుఁ బులోమముని గారి పుట్టియుఁ, జతుర్దశభువననాయకుని పట్టమహిషియు, ననూర్యంపశ్యయు నగు మీయంబతో నాలుబిడ్డలసంరక్షణము సేయఁజాలని వజ్రపాణి యిట్లు చెప్పె నని పలుకుము.

చ. మదమునఁ బొంటిసంపదలమాట దలంపకు, శోక మెచ్చు; నీ
కెక్కెనెలవుపంప కష్టములు గాపుర ముండునె యెల్లయప్పు; దే
ర్దినములు వచ్చు, వెండియును దివ్యలకో సఖి! యాశుభాలునే
శేను జిగిపూచుచెట్లు మరల న్మధుమాసమున న్నిగుర్పవే!

జయం—దేవా! అట్లయిన మీ రానతిచ్చినట్లు చేసెద. (అని పోవును.)

(తెరలో)

చ. తునిమి బగాఁగఁ గొండలను ద్రుంచినదోర్బలశాలి, యాయువా
ల్యమును వలకించినట్టిరసికాగ్రణి స్వర్గపురైకనాథుఁడున్
గను లొకవేయి దాల్చి జగత్త్రయము న్గనిపెట్టునేత, యు
య్యనిమిషనాథుఁ డేఁడి, పనుజాధిపుఁ డాతనిఁ జూడఁ గోరెడున్. 18

బృహ—అదిగో నడచుచున్న తమాలవృక్షములో, పుంజీభూతము లగుకాఱుచీఁకటులో, యన రాక్షసులు మన యున్నదెసకే వచ్చుచున్నారు. ఇదియును మేలే. ఇంతలో జయంతకుమారుఁడు కాంతాసంతానమును నిరపాయముగాఁ గొనిపోవచ్చును.

మహేం—ఆచార్య! నిపు డతనితో నెట్లదుకొని సంభాషింతము? సామవాక్యములతోఁ బట్టుపడిచిన సంధికి నంగీకరించునేమో?

బృహ—ఎంత వెఱ్ఱివాఁడవు! దురాత్ముఁడు శాంతవచనములఁ జక్కఁబడునే?

మాణి—దేవా! ఆజ్ఞాపింపుము. సేవకున కిది మహాప్రసాదము.

మహేం—అట్లయిన నో మాణిభద్ర! జగద్భ్రీసంధాయకుఁ డగువాసుదేవుఁడు వాసము సేయు ద్వారకానగరమునకుఁ జని యదుకుల కమలాకరప్రభాకరుం డగు నా పుండరీకలోచను సందర్శించి దివౌకసుల యార్తి సమగ్రముగా విన్నవించి,

సీ. కాళీయఫణిఫణాగ్రములఁ దాండవమాడునడుగుఁదమ్ములకు జోహారు లనుము
అదితికశ్యపులకు నవతరించిననాఁడు మా కొనర్చినమేలు మఱవ మనుము
అమరసంతతి యిట్టు లగచాట్లఁ బడుచుండ నౌరులకైవడిఁ జూచు టొప్పదనుము
ఈ తెలంగునఁ జేయ లాఁతివారము మేము చాలకాలమునాఁటిసఖుల మనుము
ఆలుబిడ్డలదెసఁ జూచి యమరవిభుఁడు
వేయిఁగన్నులబాష్పము ల్విడిచె ననుము
అసురఁ గడతేర్చుపని తన కలఁతియనుము
దైవహితపుమాట సేయది తప్ప దనుము

మాణి—దేవా! అట్లంతయు విన్నవించెదను.

బృహ—దానవుఁడు వచ్చునంతకు నీ విటనుండే యాతనిపలుకులు విని దేవతలకుఁ గాని యవ్వల నరుగుము. అప్పుడు నిర్జరులయవస్థ యాతఁ డెంద్రునకు సమగ్రముగ నెఱిఁగింప నవకాశ ముండును

మాణి—హా! కష్టము. కష్టము. దానవసైన్యంబులు సమీపభూములకు రాన వచ్చినవి.

బృహ—మహేంద్రా!

ఉ. మనమున నించుకేని యనుమానము నొందకి దానవేశ్వరు
న్గని వినయంబుతో నెదురుగాఁ జని గద్దియఁ జేర్చు; లావు నా
యువపుడు నల్పుఁడై యొదిఁగియుండుట న్యాయతగాదె; గ్రీష్మమం
దున బలుతిప్పలుంబడునదుల్ కాలునఁ బూర్తిఁ జెందవే? 22

మఱియు నో సునాశీర!

తే. గీ. అధిక తేజస్సులకు నైన నప్పుడప్పు
డుచ్చనీచదశలు గల్గుచుండుఁ జూడ
జగము వెలయింపఁగల సూర్యచంద్రులకును
గ్రమత నుదయాస్తమయములు గల్గునట్లు. 23

మహేం—దేవగురువులయుపదేశము శిరసావహించినాఁడ. (అప్పుడు నరకాసురుఁడు, పంచజనుఁడు, వజ్రకంఠుఁడుఁ బ్రవేశించుచున్నారు.)

నర — ఓయీ పంచజనుఁడా! బాహుబలంబున, బుద్ధివైభవమున మనకన్న నల్పుఁడగు మహేంద్రుని సింహాసనభ్రష్టునిఁ గావించి నాకలోకమునుండి పాఱఁదోలక మన వంశకర్తలగు నాదిరాక్షసు లూరకుండుటకుఁ గారణమేమి?

పంచ — దేవా! అసురోత్తము లూరకుండలేదు. దివిజసామ్రాజ్యవిక్రమక్రీడారంభులయిన మా పూర్వులు త్రిలోకవిజయంబు గాంచినప్పుడు కుటిలుఁడగు విష్ణుదేవుఁడో మతిలేని శంకరుఁడో యేవో రూపములెత్తి వారలఁ గడతేర్చుచుండువారు. ఆకారణంబున నితని కింతవిభవము జరుగుచున్నది. ఈపర్యాయము మీరన్నట్లు నిరాటంకముగా జరుగఁగలదు

నర — (నవ్వుచు) మన దానవవీరులు నిజముగా నా దామోదరునిచేత సయితము నిహతులయిరా? అట్లయిన వాని పరాక్రమ మెట్టిదో చూడవలసినదే.

వజ్ర — మహాప్రభూ! వారువచ్చిపిలిచినారు. మీముందర వారు దిగదుడుపునకైనను బనికిరారు.

బృహ — మహేంద్రా! అదిగో దానవుఁడు. వాని సెదురుకొందము రమ్ము.

మహే — దానవేంద్రా! నీకు స్వాగతము.

బృహ — దానవేశ్వరా! విజయ మగుఁగాక!

పంచ — నీవన్నను ననకున్నను విజయ మీవఱకే యయినది.

నర — (ఆశ్చర్యము నటించుచు నింద్రునితో) ఎవరు వీరు? నముచిగర్వనిర్వాపణధూర్వహులు, పాకపరితాపసంధానధురీణపంచాననులు, జలప్రాణానిలకాలభుజంగులు నగు సహాల్యాభుజంగులా? మహేంద్రా!

మ. అపరాధంబులు గన్గొ మావలన చండాంశుతేజోనిధీ
తపనోద్యద్దహనాయమానపటుదోర్దర్పప్రతాపాఖ్య ని
న్నిపు డీకీర్తినిఁ జూడవచ్చితిని నే నిన్నాళ్లు రాకుంటకు
న్గృపతోఁ డెన్ క్షమియింపు తమ్ముఁడఁ గదా యెంతైన దేవేశ్వరా! 21

అయ్యో! మఱచితిని. నేను మీకుఁ దమ్ముఁడ ననుట మిమ్ము నెంతవమానింపఁ దలఁచుటగదా!

వజ్ర — అజాగళస్తనములవలె నిరర్థకమయిన వజ్రాయుధము ధరించి యీ పరాక్రమహీనుని తమ్ముఁడని పలికించుకొన్న మీకవమానము మహాప్రభూ!

పంచ — ఓ మహేంద్రా! ఓ దేవగురూ! నేను పంచజనుఁడను; నరకమహారాజు బంటను.

బృహ — మేము మిమ్మెఱుఁగక పోలేదు.

మహేం——దానవేశ్వరా! ఉల్లసపుబలుకులతో నేమి ప్రయోజనము? శత్రు రాజులపై దండువెడలుట క్షత్రియధర్మ మగుటచే నీ విట్టు చేసితివి. ఇందు క్షమింప వలసిన దేమున్నది? జయము నొందితివని యెఱుంగుదును.

మాణి——(తనలో) ఈసమయమున నే నిచ్చట నుండరాదు. నాటునుండి కిరి పనులఁ గనిపెట్టెద (అని పోవును.)

నర——పురందరా! నామాటలను నీ వింత యుపేక్షించెదవేల? అట్లయిన నింక నుల్లసపుఁబలుకులతో నేమి? నావచ్చినపని చెప్పెద వినుము.

తే. గీ. ఎల్లభువనంబులకు నీవ యేలిక వఁట
బలము గలవాఁడ వఁట మానవంతుఁడ వఁట
కొండ రెక్కలఁ గొన్నింటిఁ గూల్చితి వఁట
యేది చూతము రణ మిప్డు యించుకంత.

బృహ——(తనలో) మా యసహాయత్వము నెఱిఁగి వీఁడు మమ్ము మాటిమాటికి రణమునకుం బిల్చుచున్నవాఁడు.

మహేం——దనుజేశ్వరా! రణమున కేమి? అదియొక భాగ్యము కాదు. చూడుము.

చ. కనుఁగొన దేవదానవులు కశ్యపుసంతతివారె కావున
న్దనుజవరేణ్య! యన్నలకుఁ దమ్ములకుం బగ జెల్లునయ్య? లోఁ
గినియక మీరు మే మెపుడు క్షీరము నీరముల ట్లుండిన
న్మనలను దేఱిచూడఁ దరమా యొకమాత్రపువాని కాజిలోన్.

నర——ఆహాహా! ఎంతకాలమునకు నేను మీకుఁ జుట్టము నయితిని?

పంచ——సోదరప్రేమ మహేంద్రునిశరీరమునుండి వెల్లివిరిసి పాఱుచున్నది.

వజ్ర——పిల్లుల కెలుకలును, దోడేళ్ళకు మేఁకలును నెంత దగ్గరచుట్టములో మాకు మీరును నంత దగ్గఱ చుట్టములే.

బృహ——ఓ దానవసార్వభౌమా! ఈమహేంద్రుఁడు వచియించినట్లు మన యుభయకులములు పొందుపొసఁగియుంట యుచితము. మీరు రాక రాక వచ్చినయతిథుల గుటచే మా కాదరణీయులరు. అందుచేఁ గూరుచుండి ప్రసంగింతము. నీ వామహేంద్రపీఠము నధిష్ఠింపుము.

మహేం——దానవేంద్రా! అట్లు చేయుము. మాకు మీ రతిథులుగదా!

నర——ఓహోహో!

ఉ. ఎన్నఁడు లేనిమూర్తి యిది యెప్పటినుండి జనించెనయ్య? నీ
కిన్నరకుండు దేవవిభుఁ డెక్కడుపీఠము నెక్కువాఁడె? మీ

రన్నను నే నోర్వఁగలనా యది యయ్యాది యొక్కఁడు తాఁ
గన్నులు వేయి దాల్పవలె గౌతమునింటను గోడి గావలెన్

వజ్ర—నిజము. నిజము. అంతమహిమ గలవాఁడే దాని వహిస్థింపవలెను. పాప మీమహేంద్రుఁడు కష్టపడి రేయి యనక పగలనక కోడియో పక్కియో యయి వేయిగన్నులు దెచ్చుకొన్నాఁడు. అంతవానికిక్క యెవరికున్నది?

బృహ—(తనలో) రాక్షసుల యెత్తిపొడుపుమాటలు భరింపశక్యముగాకున్నవి!

మహేం—(తనలో) ఇంతకన్న శూలములతోఁ బొడిచిన మేలు కటకటా. కాల మెంతలో మాఱినది.

బృహ—దానవనాయక! ఎన్నఁడో పొరపాటున నొనర్చిన లోపముల నెంచి యింతవానిని మీరధిక్షేపించుట మీవంటి వీరపురుషుల కుచితముగాదు.

నర—అట్లయిన మీకు హితముగుపనియే యొనర్చెదను. చిత్తగింపుఁడు. ఓయి మహేంద్రా! భూధరపక్షచ్ఛేదనకొండ!

మ. ధరణీరాజ్యము వీరభోజ్య మని పెద్ద ల్సెప్పఁగా వింద వి
గ్రరలోకేశ్వర! రెండుపక్కల కిట న్వైరిత్వ్యత్తురం బిమ్ము నీ
కరదండుం గులిశాయుధంబుఁగొని సంగ్రామంబు గావింతువా?
సురసామ్రాజ్యపదంబు నాకుఁ గరము న్ఙాంకించి యర్పింతువా? 29

పంచ—మహారాజా!

తే. గీ. కాలుదండంబు, ధనదునికలుకఁగత్తి,
నరుణపాశంబు, మనమీఁద వమ్ము లయ్యె!
వజ్ర మేటికి ధరింపవలయు వీఁడు?
కొండలను రాళ్ల మలఁచి చెక్కుటకె గాక!

వజ్ర—దేవా! మీరు చూచినతోడనే యెన్నఁడో వచ్చినట్లు నిశ్చేష్టులగు నీదేవరాజబృహస్పతులు యుద్ధము సేయుదురా? బలహీనులమీఁద నెగురు మన్నచో నీయనవంటివారు మఱియుండరు.

నర—మహేంద్రా! ఊరకయుండెదవేల? ప్రత్యుత్తరమిమ్ము

పంచ—హరియో హరుఁడో తమకుఁ దోడ్పడువఱకు నిరుత్తరులయి యుందురు కాఁబోలు?

వజ్ర—హరియా వచ్చుట? అతఁడు తనరక్షణముఁ జేసికొన్నఁ జాలు. వీరిని రక్షించినంతఫలము.

నర—అన్నట్లుమఱచితిని. ఓ దేవరాజా!

మ. హరి మీపాలిఁటి దైవతం బనుచు దైత్యధ్వంసి యంచు న్నుతిం
తురుగా మీరలు సర్వకాలమును జేతుల్మోడ్చి; వాఁ డేఁ డి? య
క్కరకు న్రాఁడవి యేమి? వచ్చి మిగుల న్గారుణ్య మేపార ని
ర్జరుల న్బ్రోవ డదేమి? పిమ్మట సమాశ్వాసింపఁ జూవచ్చునే? 30

మహేం—(తనలో) హరి నీవిధముగా నిందించు వీని కేమిగతి కలదో కదా?

బృహ—(తనలో) ఇట్టి వైపరీత్యములు కాలమాసన్నమైనవానియందుఁ గన్పట్టును.

వజ్ర—గురుశిష్యు లిద్దఱు జెల్లముకొట్టినరాళ్ళవలె నూరకుండెద రేల? మహారాజున కేదో యొక ప్రత్యుత్తర మిండు.

మహేం—ఆచార్యోత్తమా! ప్రత్యుత్తర మొసఁగుడు.

బృహ—దానవేంద్రా! వేయుమాట లేల? ప్రతాపానలపరిశోషితదిక్పాలకసేనాసముద్రులును వశీకృతనారాయణులును నగు మీతో సమర మొనర్ప మహేంద్రుఁ డెంతవాఁడు? అతఁడు సంధి యుచిత మని యూహించుచున్నాఁడు.

పంచ—దేవదానవుల వైరము సంధిచేసికొనుటకుఁ బాకము తప్పినది.

వజ్ర—ఇంద్రునకిప్పుడు భయజ్వరముచే నొక పెద్దసంధిరోగము ప్రవేశించినది.

నర—మహేంద్రా! అట్లయిన నానిశ్చయము విస్పష్టముగఁ జెప్పెద వినుము.

శా. పయిమలు వింటి నచ్చరలపాటలు చేర్చితి నీవు మేను ని
ర్మలశుభ్రపారిజాతకుసుమంబుల సెజ్జలమీఁద నాకభూ
ములు చిరకాల మేలితివి పూర్తిగఁ జెల్లెను వందు మీకు దై
త్యుల కిఁక వంతు వచ్చెఁ దగు దూరము పొందు తొలంగి వేల్పులా. 31

దేవత లెంతకాలము స్వర్గము పరిపాలించి రంతకాలము దానవులును పరిపాలించిగాని తొలఁగరు. మఱియు స్వర్గమునుండి యొక్కపూరిపుల్ల యయినఁ గొనక యెందయినఁ జని బ్రతుకుఁడు. దీనికి విరుద్ధముగాఁ బ్రవర్తింతురేని యీనరకుఁడు వేల్పులపై జాలి పొందువాఁడు కాఁడని మీర లెఱుఁగుదురు.

పంచ—దేవా! మీరు లెస్సగా సెలవిచ్చితిరి.

వజ్ర—ఈపాడుదేవతలు నేఁటికాలమునకు మాయునకు తగిలి పోవుచున్నారు.

మహేం—(విచారముతోఁ దనలో) రాజ్యలక్ష్మీ! నీవు చంచల వనుమాట నేఁడు నిశ్చయమయినది.

బృహ—(తనలో) అనుకొన్నదాని కేమియుఁ గొఱఁత కలుగలేదు.

మాణి—(తనలో) కటకటా! త్రిలోకాధీశ్వరున కెంత కష్టమువచ్చినది! ఇంక నే నిచట నిలువఁజాలను. నాపనిమీఁదఁ బోయెదను. (అని నిష్క్రమించును.)

నర — ఓ యింద్రబృహస్పతులారా ! మీ యునికి నాకోపానలంబులకు ప్రజ్వలన హేతువు. కావున మీ రిటనుండి సత్వరము పొండు.

వజ్ర — చుట్టుపట్టు పొలిమేరలో నైన మీరు కనంబడుదురేని మీ గుండెలలో నిద్రపోయెదను జాగ్రత.

బృహ — మహేంద్రా! ఏల యాలస్యము ? పోవుదము రమ్ము.

మహేం — (తనలో)

సీ. చిరకాలమునుండి సురలకాణాచి యగు విబుధలోకంబును విడుచు టెట్లు ?
చింతామణిభద్రసింహాసనం బున్న యమరావతినిఁ బాసి యరుగు టెట్లు ?
మధువైరిచరణాబ్జమకరందరస మైన మందాకినినిఁ మఱచు టెట్లు ?
సిరికిఁ దోఁబుట్టువై క్షీరాబ్ధి నుదయించుపారిజాతముఁ బాసి బ్రతుకు టెట్లు ?
దినము నైరావతము నెక్కి తిరుగ కుండ
కాలినడకను నట్టిట్టు కదలు టెట్లు ?
నందనోద్యానవీథుల నడువకుండ
నిముసమైన నేఁ బెఱచోట నిలుచు టెట్లు ?

మహేంద్రబృహస్పతులు నిష్క్రమించుచున్నారు.)

వజ్ర — ఇప్పటికి నాకమునకు దరిద్రదశయంతయుఁ దొలఁగి శోభ కలుగు కాలము వచ్చినది. దేవా! మీరి చింతామణీభద్రసింహాసనమధిష్ఠించి దేదీప్యమానప్రభలతోఁ గొలువుదీర్చి మాకన్నులకు విందు సేయవలయును.

పంచ — దేవా ! ఇప్పు డీపీఠము నెక్కవలదు. భగవంతుఁడును దానవకుల క్షేమంకరుఁడును నగుశుక్రాచార్యుని యనుమతంబునఁ బుణ్యదినంబున సుముహూర్తంబున మీరు సురసామ్రాజ్యపట్టాభిషిక్తులగుట యుచితము.

నర — ఇది యవశ్య మాచరణీయము. ఇంతలో నాకలోకవైచిత్ర్యములఁ గనుఁ గొందము రండు. పట్టాభిషేకముకన్న ముందు మహేంద్రుని యుంపుడుకత్తె యగు ఊర్వశిని సందర్శించుటకై నామనంబు తత్తరపడుచున్నది. దానిచక్కదనము వర్ణనాతీతమని మున్ను నారదాదిమునులవలన వినుచుందును. కావున సత్వరము పోదము రండు.

పంచ — చిత్తము. (అందఱు నిష్క్రమించుచున్నారు.)

పోయి సుఖింపవచ్చుననియు సేనానాయకులగు మురహయగ్రీవులు నొక్కి పలుకుటచే కొండంతయుత్సాహముతో నేను రంభను జేపట్టి తీసికొనిపోవచ్చునని యిందు వచ్చితిని. కాని యద్భుతభ్రాంతి సంభవించినది. గడుసు లంజ రంభ యేమైనదో యెవ్వరికిం దెలియదు; దానిజాడ దెలుపువాడు నా కెవ్వరయిన గనంబడిన బాగుండును. (అని యిట్టట్టు(జూచి) అదిగో మావజ్రకంఠుడేటువచ్చుచున్నాడు. వానినడిగి తెలిసికొనియెద.

[అప్పుడు వజ్రకంఠుడు ప్రవేశించుచున్నాడు.]

వజ్రకంఠుడు—(తనలో) ఆహా! బళీ! ఈనరకమహారాజుగారు చిరకాలజీవులయి యుందురుగాక! ఈతనియధికార మాచంద్రార్కము నిలుచు గాక! ఈమహాత్మునివలననే గదా రావణకుంభకర్ణుల నాటను, తారకాసురబలిచక్రవర్తుల నాటను, లేనిగౌరవము మారాక్షసకులమునకు నేడు కలిగినది! కాని నరకమహారాజు మహేంద్రుని యింపునకుత్తేయు నూర్వశిని గూడుటకు మిగుల యత్నించుచు జంద్రోదయము కాగానే నన్నుం బనవద్దకు రమ్మని యానతిచ్చె. ఇంతలో మందబుద్ధియగుమందపాలునితో నింతకు మాటలాడి వినోదించెదను. వీఁ డెవరికొఱకో నిరీక్షించుచున్నాడు. (అని ప్రకాశముగా) ఓరీ! మందపాలా! నీ వెవరికొఱకు వెదకులాడుచున్నావు?

మంద—(సమీపముగా వచ్చి) ఓరీ! వజ్రకంఠా! నీ విప్పు డేం దలంచుచున్నావు? నీ కెక్కుడైన రంభ యగుపడలేదు గదా!

వజ్ర—ఆహా! నాకొకయానందము కనంబడినది. అది రంభయే యైయుండవచ్చును. అయిన నది యెట్లుండునో నీ వింతకు మానవాలు చెప్పినపక్షమున దానిజాడ నీకు దెలుపగలను?

మందపా—(సంతోషముతో) కనంబడినదా! వెనుక రెండుమూడుసార్లు దానిని నేను మారువమునందే చూచితిని. అప్పటినుండియు దానియాకృతి నామనమున నాటుకొనియే యున్నది. దాని కానవాలెఱిగించెదవినుము. అది చక్కని చుక్క. దాని శరీరకాంతి తాటిపేశమువలెం బచ్చగ నుండును. దానికలవెండ్రుకలు ముసిబొగ్గులలో జిడ్డిగింజలో యనుకొనవలయును. దానికొప్పు మొలకాకువలె. నల్లని యాపములోనుండి తీసినకడితవలె నల్లనై పెద్దదిగా నుండును. దానికడ యిసుకగరిటె కాడలాగున నుండును. కన్ను లాలిచిప్పలు. దానిపెదవి క్రొత్తావకాయ పేడువలె నెఱ్ఱనై యుండును. మొగమిత్తడిసిబ్బివలె గుండ్రముగ నుండును. అది పువ్వులపావడం గట్టి యుల్లిపొరవంటి యుత్తరీయము వల్లెవాటు వేసికొని తపుక్కుచు తారుచు సొక్కుచు సోలుచు నిక్కుచు నీల్గుచు వంగుచు పొంగుచు నాడుచు పాడుచు నడచినప్పుడు చుక్కలలోం జంద్రునిలాగు గజ్జెలగోడిగ లాగు రామచిలుకలాగు గోరింకలాగు కికిలిపిట్టలాగు నెమలిపెంటిలాగు

కంటకుఁడు గాఁడు. మహారాజుగారి యంతర మేమి నీయంతర మేమి? తారతమ్య మెఱుఁగక మాటలాడెదవా?

మంద—(వజ్రకంఠుని కాళ్ళపైఁబడి) నాతండ్రీ! నన్ను రక్షింపుము. బుద్ధి చేరక నోటివట్టుప్రకూఁతలు కూసితిని. మఱియొకసారి నే నిట్లు ప్రేలుదునేని నన్ను నీచిత్తమువచ్చినశిక్ష చేయింపుము. కావలసినవాఁడవు గనుక యని నీ వన్న నిట్లంటిని గాని మది తప్పించుచో మరల నందునా?

వజ్ర—సరే! నిన్ను రక్షించితిని. ఇఁక ముం దిట్టిమాట లెన్నఁడు ననకుము. ఇఁక నేఁ బోవలయును నన్ను విడువుము.

మంద—(లేచి) నీదయచేత నిప్పటికి గండము గడచి బ్రతికి బయటఁబడితిని. నీ విప్పు డెక్కడికిఁ బోయెదవు?

వజ్ర—నరకమహారాజుగారు సూర్యశశిరహితావనమున కోర్వక యీరాత్రి వెన్నెలలోఁ బువ్వులపాన్పుపైఁ బవ్వళింతురు. ఊరడించుటకు ప్రియభృత్యుఁడ నయిన నే నాయనప్రక్క నుండవలయును. ఎన్నివర్తమానముల నంపిన నూర్వశి మహారాజువద్దకు రాలేదు. అందుచే నామెను దోడితెచ్చుటకు సేనాపతియైన నిశుంభుని మహారాజుగారు పంపినారు. ఎట్లయినఁ జంద్రోదయ మగునప్పటికి నే నక్కడ నుండవలయు.

మంద—అదిగో విబూదిపండో ముగ్గుబుట్టయో తగరపుపళ్లెమో యన్నట్లు చంద్రమండల ముదయించుచున్నది. నీ వింక సత్వరము పో. నామాట నచ్చట మైలు పెట్టకుసుమా! రంభ నీకగపడినప్పుడు నాతోఁ గొంచెము చెప్పు.

వజ్ర—వేయేండ్లు తలక్రిందుగఁ దపస్సు చేసిన రంభకు నీవంటి రసికుఁడు దొరకఁడు. ఆమెను నీవే వెదకికొనుము. నే వెదకఁజాలను.

(అని యిద్దఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది విష్కంభము.

---

[అప్పుడు దేవేంద్రమందిరము ముందట నొకచంద్రకాంతవేదికమీఁద బువ్వులపాన్పుపైఁ గూర్చుండి నరకాసురుఁడు వజ్రకంఠునితోఁ గూడి ప్రవేశించుచున్నాఁడు.]

నర—ఓరీ! వజ్రకంఠా!

చ. అజనుతి నష్టదిక్పతుల నాహవభూమి నటన్న సంతసం
బొదవ దొకింత; రాజ్యరమ నూనితి నంచు మనంబునందు స
మ్మద ముదయింప దించుకయు, మక్కువమై నొకసారి యూర్వశి
పదయుగము స్పృశింపఁ గలభాగ్యము నాకు లభింప కుండుటన్. 1

వజ్ర—దేవా! ఆకోరికయు మీకు చిరకాలంబునఁ దీఱఁగలదు. ఊర్వశిందోడి తెమ్మని మీరు మనసిశుంభుని బంపియున్నారు గదా! అతఁడామె నీపాటికి వెంట బెట్టుకొని వచ్చుచుండు నని నే నూహించెద.

నర—అహాహా! నా కంతభాగ్యము లభించునే? ఒకవేళ లభింపఁ దలఁచుకొన్నను దుస్సహ మయిన యీవిరహతాపము నన్నంతవఱకు బ్రతుకనిచ్చునని నాకుఁ దోఁచదు. ఈమదనునకుఁ దోడగుట కదిగో శీతమయూఖుఁ డుదయించినాఁడు.

తే. గీ. కలసి వేల్పులు భుజియించుకంచ మనఁగఁ
జంద్రబింబము వెలుఁగొందుఁ జదల నదిగో!
సురలు దినువేళఁ గంచముచుట్టుఁబడిన
మెతుకులట్టులు చుక్కలు మెఱయుచుండు. 2

వజ్ర—మహాప్రభూ! మీరు సరిగా వర్ణించినారు. ఆకంచములోఁ బెట్టిన పాఁతయుసిరికపచ్చడిముద్దవలెఁ జంద్రునిలో మచ్చఁ గనఁబడుచున్నది.

నర—ఓచెలకాఁడా!

తే. గీ. విరహతాపాతిశయమున వెచ్చ నూర్చి
వికలచిత్తులై యున్న కాముకులఁబట్టి
సూది బొడిచెడు వజ్రంపుటీఁటె లనఁగఁ
జంద్రకిరణము ల్వ్యాపించె జగతియందు. 3

మఱియు

శా. నీరేజప్రభవాండ మంతయును నిండెన్వెన్నెల, ల్మొత్తయః
పారావారతరంగమాలల కనుప్రాసంబులై, దివ్యత
స్వీరంగన్నవమందహాసములసన్ నెయ్యంబులై, సారక
ర్పూరక్షోదపరాగపుంజములకు న్బోరానివియ్యంబులై. 4

వజ్ర—ఈవెన్నెలకతమున బ్రహ్మాండ మంతయు సున్నపుగడవవలెఁ దెల్లనయి యున్నది.

నర—ఈచందమామకాఁకలకు, నాపువ్విలుకానిదాఁకలకు నాశరీర మింక నిలుచుట యరిది. ఈశశాంకునివి శాతశరములుగాని శీతకరములు కావు. సుధాంశుఁడని పేరొంది నిప్పులం జెరుగుచున్న యితఁడు పయోముఖవిషకుంభముసుమీ! అందుచేత నే

తే. గీ. వనజనాభుని కైనఁ బద్మజుని కైన
నగ్నిదేవుని కైన నయ్యముని కైన

వజ్ర— నాకంటికి కాఁడువాండ్రందఱు సొగసుగనే కనఁబడుచుందురు గావున చక్కదనమున నెక్కువతక్కువలు నిర్ణయింపఁజాలను. కాని వీపుటుకలంబట్టి వేల్పువెలయాండ్రకు మరణము లేకపోవుటయే గాక ముదిమియు లేదని తేలినది. పోనీ అందఱు కొంపలు దీయుచు ఱాళ్ళలాగున బ్రతుకనిమ్ము.

నర— వజ్రకంఠా! మననిశుంభుఁ డేలొకో కడు నాలస్యము చేయుచున్నాఁడు. ఊర్వశి వానికిఁ గనఁబడియుండదా? కనఁబడిన రానొల్లదా? ఆలస్యకారణ మేమో నీవు పోయి తెలిసికొనివచ్చెదవా?

వజ్ర— నాకింతకన్న నుద్యోగ మేమున్నది? అట్లే పోయెదను. ఓదైవమా! అందఱు నాదృష్టమును దక్కి నాకాళ్ళపైఁబడునట్లు నన్నొక స్వర్గలోకపు భోగముదా నిగఁ జేయక యీగాదిక్కుమాలినపుట్టుక యేల పుట్టించితివి? (అని కొంచెము నడచి) అమ్మయ్యా! నాయదృష్టము బాగున్నది. ఊర్వశిం దోడ్కొని యదిగో నిశుంభుఁ డిటకే వచ్చుచున్నాఁడు.

నర—(దిగ్గున లేచి) ఏది? ఏది? నాయావత్ప్రాణము?

వజ్ర—అదిగో! మన నిశుంభుని వెనుక నడుగులు లెక్కపెట్టుకొనుచు దలవంచుకొని పెళ్ళికూఁతురువలె నడచి వచ్చుచున్నది.

నర—వజ్రకంఠా! మహేంద్రుఁ డూర్వశి నిచ్చట విడిచిపోవుటచేఁ గామగవియు నమృతభాండము మొదలగు దివ్యవస్తువులను దివమునుండి తొలఁగించుకొనిపోయెనని నాకిపుడు విచారము లేదు.

క. నాపాలిసురభి యిదియే
నాపాలిఁటి పారిజాతనగ మియ్యదియే
నాపాలి యమృత మిదియే
నాపాలిఁటి రత్న మిదియె నానిధి యిదియే. 10

వజ్ర—వెఱ్ఱికి వేయివిధములు. అందులో నిది యొకటి.

నర—ఓరి మూర్ఖుఁడ! జగన్మోహన మగుదానియాకార మొక్కసారి కన్నుల కఱవుదీరఁ జూడుము. ఆహాహా! నాకన్ను లింతకాలమునకుఁ జరితార్థత నొందినవి.

సీ. లావణ్యమును గ్రిక్కిఱలన మోమును జూచి చూడనక్కఱలేదు సోమునింక
సిరికిఁ దానకమైన చెలువచూడ్కిఁ దలంచి తలపనక్కఱలేదు తమ్మిరేకు
మిఱుమిట్లు గొలుపు నెమ్మేనివన్నియ నెంచి యెంచనక్కఱలేదు మించుమాట
యుండిలేనట్టు లుండు నువిద నెన్నఁడు నెన్ని యెన్ననక్కఱలేదు మిన్నుతీవ

వజ్ర—ఈవఁడును నతఁడు తండ్రిని జూడఁబోయినాఁడు.

మంద—అయ్యయో! హయగ్రీవుఁడయిన వాసుదేవు నెదుర్కొనలేదా ?

వజ్ర—అయ్యో! ఎదుర్కొనకేమి. అతఁడు కొంతసేపు పోరిపోరి నిన్నసాయంకాలమే రంభాసంభోగార్థమై చనెను

మం—అయ్యయో! సమయమునకు పంచజనహయగ్రీవు లిద్దఱు లేకపోయిరే! వారాపనులమీఁద నిప్పుడే పోవలయునా? మఱియొకప్పుడుపోరాదా, వారి నిప్పుడే పిలిపింపఁగూడదు.

వజ్ర—పిలుచుటకుఁ దగినవా రెవ్వరులేరు. నిన్నే పంపఁదలఁచుకొన్నారము పోవుదువా?

మంద—అయ్యో పోకేమి, స్వామి కార్యము చేయనా?

వజ్ర—అట్లయిన శ్రీకృష్ణునియెదుటకుఁ బోయి నిలువుము. అతఁడే నిన్ను బంపఁగలఁడు.

మంద—ఓరి! దుర్మార్గుఁడా! నన్ను జావుమనుచున్నావా?

వజ్ర—చావకుండఁ జచ్చినవారియొద్ద కెట్లు పోఁగలవు.

మంద—అట్లయిన పంచజనహయగ్రీవులు చచ్చినారా?

వజ్ర—చావక బ్రతికియున్నారా?

మంద—నీకసుపుకాల! నీమాటలెప్పుడు నిట్లే యుండును. ఏసంగతియైనసరిగా జెప్పక నడ్డదిడ్డముగఁ జెప్పెదవు. ఇప్పుడు మహారాజుగారేమి చేయుచున్నారు.

వజ్ర—ఆయన యుదయమునుండియు శ్రీకృష్ణునితోఁ బోరుచున్నారు. ఇప్పటి వఱకు మనపక్షము బలముగానే యున్నది. మహారాజుగారు శక్తినొకదానినిఁ బ్రయోగించి వాసుదేవుని మూర్ఛపుచ్చినారు. అందుచే మాకించుక ధైర్యముకలిగినది.

మంద—ఆదెబ్బతో వాఁడు చచ్చెనా లేదా ?

వజ్ర—లేదులేదు. వానిభార్య మూర్ఛితుఁడైనభర్తను సేదదేర్చి విల్లుగైకొ దనుజలోకభయంకరముగ యుద్ధము చేయుచున్నది.

మంద—ఏమిచిత్రము. ఆఁడుదియా యుద్ధముచేయుట! ఔరా కాలమహి

వజ్ర—అది యాఁడుదిగాదుగాదురా బాబు నూఱుమంది మగవాండ్రను జం పుట్టినది. మతిమాలినముండకొడుకు బ్రహ్మదేవుఁడు పిడుగువంటి మగవానిని జేయఁదలఁ మంచి యాఁడుదానినిగాఁజేసెను. ముల్లోకములు జయించిన మనమహారాజుగారి నా యిప్పుడు ముప్పతిప్పలుపెట్టి మూఁడుచెఱువులనీళ్ళు త్రాగించుచున్నది. ఇన్నా

బ్రతికి యింటివెనుకఁ జచ్చె నన్నట్లు మహేంద్రాదులు గెల్చిన దానవసార్వభౌముఁడు తుద కాఁడుదానిచేతఁ బడునేమో యని భయముకలుగుచున్నది.

మంద — సరే. ఇంక మనదారి మనము చూచుకొనవలసినదే. నీప్రాణరక్షణ మెట్లు చేసికొనియెదవు.

వజ్ర — మనము కామరూపులముగద. అందుచేత నేను నందినో పందినో కుక్కనో నక్కనో పిల్లినో నల్లినో బల్లినో గొల్లినో కేకినో కాకినో చీమనో దోమనో ఛాయనో అప్పనో చెట్టునో చేమనోయై ప్రాణములు దక్కించుకొనియెద. నీ వెట్లు దక్కించుకొనియెదవు ?

మంద — నేను నీవలె తుచ్ఛజంతువునై ప్రాణములు గాపాడుకొనను. నే నేనుఁగు నయ్యెదను.

వజ్ర — ఏనుఁగు వగుట యబద్ధము. పీనుఁగు వగుట నిజము.

(తెరలో)

క. అని దివిజేంద్రుని గెల్చిన
దనుజేంద్రుఁడు మూర్ఛవోయెఁ దనయరదముపై
మనుజాంగనచే హతుఁడై
విని రే యెవ్వరైన నిట్టివింతలు జగతిన్.

వజ్ర — హా! చచ్చితి; చచ్చితి.

మంద — అయ్యో! అయ్యో! ఇంక దిక్కెవ్వరు?

వజ్ర — (పరికించి చూచి) ఇదిగో గరుడధ్వజముగల శ్రీకృష్ణునిరథమును సారథియై పురకే తోలుకొనివచ్చుచున్నాఁడు. నరకమహారాజును మూర్ఛిల్లఁ జేసిన యా దానిసకూఁతురు నిన్నును నన్నును చెరియొకబాణమున కరఁజేయఁగలదు. కావుననిప్పుడే కాళ్ళసత్తువకొలఁది పరుగెత్తుదము రమ్ము.

మంద — ప్రస్తుత మింతకన్న వేఱుపాయము లేదు. పదపద.

(అని యిద్దఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది విష్కంభము.

---

[అంతట రథారూఢులై శ్రీకృష్ణసత్యాభామలును రథముఁ దోలుచు
సారథి యగు దారుకుఁడును ప్రవేశించుచున్నారు.]

దారు—దేవా! దేవీ! నరకుఁడు మూర్ఛనుండి తేలుటకు నరథము నీమఱ్ఱిచెట్టు నీడ నిలిపెదను. రణరంగమున వీరవిహారము సలిపిన దంపతుల కిందలి మందమలయానిలంబు ఉపచారము చేసి శ్రమ మపనయింపఁ గలదు.

సత్య—దారుకుఁడా! నీవు చక్కని పనిఁ జేసితివి. ఇప్పుడు ప్రాణేశ్వరుని యాయాసము సంపూర్ణముగ నపనయింపఁబడు.

కృష్ణ—సుందరీ! నాశ్రమ మేమున్నది? శ్రమమంతయు నీదే. ఏలయన

చ. చులుకుచులుక్కుమంచు మెయి సోకఁగ దానవుఁ డమ్ము లేయుచున్
మెరమెర దోప నేను మిసిమింతుఁడనై పడియుండఁ జూచి నీ
చెలఁగునఁ జెమ్మటల్ దుడిచి చేతిధనుస్సు గ్రహించి దానవుల్
వెలవెలఁబవన్ బొనర్చితివి వీరవిహారము మెచ్చ నెల్లరున్. 2

సత్య—శరీరమం దలఁతఁ జెందిన యవయవములు విశ్రాంతిఁ జేకొనుచుండ నలఁత పడని యవయవములు పని సేయుట ప్రకృతిసిద్ధము గదా. అందుచే నర్ధశరీర మలసినప్పుడు తక్కిన సగము మేను సమరము నడపినది.

కృష్ణ—కల్యాణీ!

తే. గీ. సాటి యెఱుఁగని నీమేని చక్కఁదనము
ముందు సతు లెంత సిగ్గును బొందఁగలరో
ప్రీతి యెఱుంగని నీపరాక్రమము ముందు
పురుషు లంతియ సిగ్గును బొందఁగలరు.

సత్య—దేవా! ఇందు నాప్రజ్ఞ యేమున్నది

తే. గీ. కారణంబులు దీనికిఁ గలవు రెండు
కమలనాథ! మీసాన్నిధ్యగరిమ యొండె
బగతుదౌర్బల్య మొండెఁ గావలయు సుమ్ము
కాక నే నేమి దైత్యులఁ గలఁచు దేను.

కృష్ణ—ఈరెండును గారణములు కావు. ఇది కేవలము వినయవృత్తి. పగతుని చేత నలయింపఁబడిన నేను నీవిజయమునకుఁ గారణ మెట్లగుదును?

క. ఎగిరిపడితి నిన్నాళ్ళును
మగవాండ్రభుజాబలంబు మాట గనక నీ

గ్గక నిక్కపు మీమందిర
మగువా ! యింక సాగిరావు మానగతినముల్. 5

మఱియు,

తే. గీ. ద్వాపరమ్మున రెండు చిత్రములఁ గంటి
జలజలోచన నీ సాహసంబుకతన

సత్య— ఆచిత్రములు వినఁగోరెద.

కృష్ణ— అందువారికి పౌరుషం బమరు టొకటి
యబలభావంబు మగవారి కబ్బుటొకటి.

దార— ఇం దతిశయోక్తి యేమియు లేదు.

సత్య— అఘటనఘటనాసమర్థులగు పరమేశ్వరులు స్వయముగ సమరవ్యాపారము నడపుచుండ నట్టిచిత్రములు పొడకట్టుట యొకవింత గాదు.

కృ— కళ్యాణి! నీసుశీలము చేత నీవిజయము నా కారోపించుచున్నదానవు; కావున నేను దానిని బరిగ్రహించుచున్నాఁడను.

దార— వీరపుత్రికయు వీరపత్నియు నగు నీదేవిచరిత్రము మహిషాసురుని మర్దించి దివిజలోకమును నిష్కంటకముగా నొనర్చి వాసుదేవునకు మహానందము గలిగించిన కాత్యాయనీవృత్తాంతమును దలఁపించుచున్నది.

కృ— దారకా! నిజము. నిజము. ఈ మెనరితి మట్టిదే. ఓసుందరి! ఆసమరసమయమున నీరూపము మిక్కిలి దర్శనీయమయి యుండెను. ఎట్లంటేని,

సీ. శ్రమమునం గ్రొత్తబడిన చెమటబిందువుచేతఁ గస్తూరితిలకంబు కరఁగిపోవ
నృత్యముం బొనరించు నెమలిపింఛమువట్లు వెడఁదవేనలి జాఱి వెన్ను నిండఁ
గిన్యవిల్లం దూఁగుతీఁగెయుయ్యాలలట్టు లాళిమ్ము తైప్రసరు ల్లాడ
గుణనినాదమునకు గొనబైన వలయునాదము నందె తొకడియముల్ మొరయుచుండ
నవనవాంగకముల శోభ నవయుచుండ
నవక మించుకయేనియు నలఁగకుండ
వెడఁదతూపులు చూపులు వెంటఁగొంటఁ
బరసమూహము నాహవఁ బరిపె తబల. 7

సత్య— ఈవిజయము ఘుణాక్షరన్యాయముగ లభించినదైన నీస్వల్పకార్యము చేత మీ మెప్పునకుం బాత్రురాల నయితినని సంతసించుచున్నదానను.

తే. గీ. మొదటి నీవాఁడితూపుల మూర్ఛవోయి
యమర క్రమ్మఱఁ దెలివొంది యని యొనర్ప
నలుక రెట్టింప మనపైకి నరుగుదెంచె
వేటువడిన దెబ్బులివోలె నెగిరిపడుచు. 12

(అప్పుడు రథమెక్కి సూతసమేతుఁడై నరకాసురుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సూతు — రాక్షసేశ్వరా! ఇదిగో శ్రీకృష్ణుఁడు రథారూఢుఁడై యుం నున్నాఁడు.

నర — ఓరోరి యాదవపాంసనా! భాగ్యాభ్యుదయబలార్జితయశోగర్వితా! నిలునిలు పాఱిపోకు.

ఉ. అని నే మూర్ఛిలినంతమాత్రమున దైత్యస్వామి నాచేత నో
డ్డినవాఁ డంచును సంతసించి నను గేలిం గొట్టుచున్నాఁడవా?
విను నామూర్ఛకుఁ గారణంబు వనితావిక్రాంతియే గాని నీ
ఘనదోస్సారము కాదు సిగ్గుపడ కీగర్వంబు నీ కేలరా? 13

కృ — ఓరోరి నిశాటకులపాంసనా! ఇందు మాకు లజ్జాకారణము లేదు.

క. మాయింటి యాఁడువాండ్రు ప
జేయుల మని విఱ్ఱవీఁగు చెనఁటి యసురులన్
మీయట్టివారి గెలువఁగ
నాయత గర్వంబె గాక యట సిగ్గేలా? 14

మఱియు నోపిశితాశన!

తే. గీ. అష్టదిక్పాలయుతుఁడైన యమరవిభుని
వేల్మిడిని జయించిన మహావీరుఁడ వయి
యాఁడుదానిచేఁ దూపు దెబ్బ లయితి ననుచు
సిగ్గుపడి చావ కేట్లు వచ్చితివి మరల? 15

నర — ఓరివాచాట! మీయింటి యాఁడువాండ్రు సాహసము కలవారే. ఇందు నీవు నిజమే పలికితివి.

ఉ. కొంకక నీదు చెల్లెలు తగుల్కొనిపోయెను పాండుపుత్రునిన్
జంకక రుక్మిణీరమణి నాఁడు తగుల్కొని వచ్చె నిన్ను నీ
వంకగ నున్న యంగనల ప్రజ్ఞలకా గరువించుచెల్ల నీ
యింకను నీది యొక్కబ్రతుకే యని మాటల నాడఁ జొచ్చితే? 16

మఱియు నియ్యది నీకు గౌరవమే యయినపక్షమున,

మ. తెలివోకింతయు లేని తాపసులు నిత్యానిత్యాభక్తిష్ఠుఁ డో కృష్ణుఁ డని
కులు పొంకుత్వే యివోపులం బొగడుచుం గోరంత తా తద్గుణం
బులు కొండంతలు చేసి విష్ణుఁ డని సంపూజింప నానా బళా
బళి నేనే హరినంచు సిద్ధమయి తా వచ్చెం బ్రపాహీనుఁడై. 21

క. భగవంతుని యవతారం
బగునని వర్ణించుచుంటి వబలా వీఁడా
భగవంతుఁడు నీ వీఁడే
భగవంతుఁ డైన జనులపాట్లేమందున్. 22

మఱియు,

ఆ వె. ఉల్లి మల్లె యౌనె పిల్లి బెబ్బులి యౌనె
కాకి కేకి యౌనె కలువకంటి
కుక్క గుఱ్ఱ మౌనె గోవౌనె గోమాయు
వాదిదేవుఁ డౌనె యాదవుండు. 23

సత్యభామా! ఇతఁడు నీపతి యగుటచే నభిమానవశంబున నిట్లు పలుకుచుంటివి; కాని మావంటి యుత్తమపురుషులు వీని నాశ్రయించుటకు వీనియం దేమిగుణము లున్నవి?

సీ. కులగౌరవముఁ జూచి కొనియాడుమందువా యదువంశజునికన్న నధముఁ డెవఁడు
విక్రమంబును జూచి వినుతింపు మందువా వాసుదేవునికన్న పంద యెవఁడు
అభిమానధనుఁ డంచు నర్చింపు మందువా నీప్రాణపతికన్న నీచుఁ డెవఁడు
సుగుణసంపద మెచ్చి స్తుతియింపు మందువా గోపాలకునికన్న కూళ యెవఁడు
యెంచుటకు నంగుళంబైన నేల లేక
పాండుసుతుల పంచను జేరి బ్రతుకువాని
కులము బలమును మానంబు గుణము గల్గి
నెగడు నే నేమి చేరి మన్నించు టేమి? 24

ఓ వీరపుత్రీ! పగతుండ నైనను నేను నీవిషయమై జాలినొందుచున్నాఁడను. ఏలయన,

క. చక్కనిచుక్కవు గదె నీ
కక్కఱ లేని దాపురించె నిటువంటి ని
న్నిక్కుమతి కిచ్చుట యుచుల్
గ్రక్కున మణిని మసిపాతఁ గట్టుట గాదే? 25

సింహాసనంబునకుఁ జక్కదనంబునకుఁ గులగౌరవంబునకుఁ దగనిమగనిం గట్టుకొని నీవు హాస్యాస్పదురాల వైతివి.

కృష్ణ—సుందరీ! ఈతని ప్రల్లదంబు లిప్పుడే తుదముట్టఁగలవు. ఓరోరి దైత్యాధమా! అవ్యవస్థితము లగు నీదుర్భాషలకుఁ బ్రత్యుత్తరంబు లొసంగ నక్కఱ లేదు. ఏమంటివేని,

మ. చకితభ్రాతృగణాంగనానికరముల్ సమ్మోదముం బొంద వై
దికధర్మంబులు సాగ నెప్పటి యటుల్; దివ్యుల్, ప్రహర్షింపఁగా
సకిరీటంబు సకుండలంబు సశిరస్త్రాణంబుగా నీదు మ
స్తకముం ధారుణిఁ గూల్చువాఁడ నిదె మచ్చక్రాహతిన్ దుర్మతీ! 43

దేవీ! చక్ర మిటు దెమ్ము.

నర—ఓరోరి క్షత్రియకులాపశదా! ఏమి! సకిరీటంబు సకుండలంబు సశిరస్త్రాణంబుగా నాదు మస్తకమును గూల్చెదవా?

సీ. జవరాండ్రతోఁ గూడి సరసమాడుట గాదు మరలించుటకు నాలమంద గాదు
జున్ను మీఁగడ వెన్న జుర్రుకొనుట గాదు పడఁచన్నులకుఁ జిన్నబంతి గాదు
పాలీయవచ్చినపడఁతి జంపుట గాదు చితుకఁ ద్రొక్కఁగ నీటిచిలువ గాదు
మతిలేకయుండిన మామఁగూల్చుట గాదు పెల్లెగుడుటకు వ్రేపల్లె గాదు
మా జరాసంధునకు నోడి మధుర విడిచి
నట్టనడిసముద్రంబున నగరు గట్టి
కాపురం బున్న జెట్టివి గావె నీవు
నన్నుఁ గూల్చువాఁడవె నీవె సంగరమున. 44

నీవు చక్రంబును ధరించుచున్నాఁడవు గావున నే నిదె వింట బ్రహ్మాస్త్రముఁ దొడుగుచున్నాఁడను.

క. కొక్కలము లేల పలికెదు
వెక్కలు; నరకాసురుండు విడువఁడు నిను నీ
వొక్కమ్మకు నొక్కయ్యకు
నిక్కముగా పుట్టితేని నిలువుమీ యెదుటన్. 45

సూతుఁడా! రథము గోపాలున కభిముఖముగాఁ ద్రిప్పుము.

సూతు—దేవా! అట్లే చేయుచున్నాఁడను.

కృష్ణ—దారుకా! రథము దానవున కభిముఖముగాఁ ద్రిప్పుము.

దార—ఆయుష్మంతుఁడా! అరదము వాని కభిముఖముగానే యున్నది.

(తెరలో)

నరకమహారాజా! శరణు! శరణు! ఈగరుత్మంతుఁడు మమ్ముం బ్రతుకనిచ్చుటలేదు. కుటిలనఖరాగ్రంబుల నెత్తురుకండలఁ జెకలించియు చంచుపుటంబున మేనులఁ జీల్చియు

బత్తాఘాతంబులం దూల్చియు నితఁడు దానవసైన్యంబుల దైన్యంబు నొందించుచున్న వాఁడు. రక్షింపుము. రక్షింపుము.

నర—ఓదనుజులారా! వెఱవకుఁడు. వెఱవకుఁడు. ఇదిగో వచ్చుచున్నాఁడ. సూతుఁడా! రథము తోలుము.

సూతు—ఇదిగో దోలుచున్నాఁడను. (ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.)

దార—దేవా! ఈదురాత్ముఁ డీసెపము పెట్టి తప్పించుకొని పోయినాఁడు.

కృష్ణు—వాఁడు పలాయితుఁ డయినను మనము వానిని విడుతుమా.

దార—కీఁడు కర్ణకఠోరముగా నొనరించిన భగవద్దూషణమువలన తత్క్షణమే వధ్యుఁడు.

సత్య—దారకా! భగవంతుని దెలిసికొనుట కెంతవాఁడు గావలయును.

శా. శ్రీరంజిల్లఁగ ముక్తి నాయక మహాశేముంతినిం గూడి యోం
కారస్యందన మెక్కి స్వచ్ఛమయి విజ్ఞానాత్మకం బైన గం
భీరాకాశముతోడ నయ్యుపనిషద్వీథి న్నిరాఘాటనం
చాలంబుం బొనరించు నీశు నెఱుఁగన్ శక్యంబె దైత్యాళికిన్.

దార—అమ్మా! నీమాట నిజము. ఈశ్వరు నెఱుఁగుటకు వీఁ డెంతవాఁడు.

కృష్ణు—దారకా! నరకునిమీఁది కరదమును సత్వరము తోలుము. ఇప్పుడే వానిని చక్రంబున కెరఁజేసెదను.

దార—చిత్తము. (అని తోలుచున్నాఁడు.)

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

---



శ్రీ

# ప్రసన్నయాదవ నాటకము.

—————:)o(:—————

## పంచమాంకము.



(అప్పు డేడ్చుచు వజ్రకంఠుఁ డను రాక్షసుఁడు ప్రవేశించును.)

వజ్ర—(తనలో) హా నరకమహారాజా! హా శ్రితజనకల్పద్రుమా! హా దనుజకులపారిజాతమా! హా సుగుణరత్నాకర! దురాత్ముఁ డయినశ్రీకృష్ణునిచే నిష్కారణముగా వధియింపఁబడితివా? అయ్యయ్యో! ఇంక మాకు దిక్కెవ్వరు? నీయండ నుండఁబట్టియే గదా దిక్పాలకులను స్వర్గమునుండి దొంగలను దోలినట్లు తోలి కంటి కగపడిన దేవతల నందఱను జేతికిదొరకిన బడితెలతోఁ గుక్కలను గొట్టినట్లు కొట్టఁగలిగితిమి. నీసంరక్షణమున నుండఁబట్టియే గదా మేము నాదిక్రింది పందికొక్కులవలె నేవెలితియు లేక హాయిగా సుఖించితిమి. నీసేవ దివ్యులకు సింహస్వప్నము గదా? ఆమేలుదినములు పోయినవి. మందభాగ్యుల మగుమాకు నీవంటియుత్తమోత్తముఁడు దొరకునా? ఇవి న్యాయమునకు దినములు గావు. అందుచేతనే స్వకులాభిమానులును ధర్మస్వరూపులును తేజోరాసులును నగుమీవంటివారు కనుపించుటచేత మడియుటయు దుర్జనులును దుర్మార్గులును దుశ్శీలురు నగువేల్పులు జయించుటయు సంభవించుచున్నది. లోకములో నెందఱికైనను చావున్నదికాని యీపాపముండకొడుకు కృష్ణునకుఁ జావు లేదు గదా! నారక్కసుల నందఱఁ జంపినాఁడు. వారి యాయువుఁ బోసికొని చిరంజీవియై బ్రతుకుచున్నాఁడు. 'పాపీ చిరాయు' వన్నమాట వీనియందె సార్థకమగుచున్నది. ఈపాపాత్మునకుఁ బురిటిలో సుడైనం గొట్టదయ్యె. పాలపాపచిన్నెయైన రాదయ్యె. ఏరక్కసుని చేతంబడి యైనఁ జావడయ్యె. ఏరోగము లేక నాచిన్నప్పటినుండియు నీకృష్ణుఁడు రాయివలె నిల్చే యున్నాఁడు. ఎంతో ధైర్యవంతుఁడను నేనే యింత బెంగఁగొనఁగా జ్యే లగుమందపాలుఁడు లోనగువా రెంత కడుపగిలి యున్నవారో కదా!

(అంతట పెద్దపెట్టున నేడ్చుచు మందపాలుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

మంద—(తనలో) హా! రాక్షసరాజా! నీకెంతలోఁ గాలమాసన్నమైనది. నీవు లేకపోవుటచేఁ బ్రాహ్మణులగుదురు దేవతలుఁ జెలరేగి మాకొంపలు త్రవ్వుదురు గదా! ఇఁక మాకెవ్వరు దిక్కు. నే నేమిచేయుదును? చిన్నతనమునుండియు నన్నదమ్ములలాగున పెరిఁగితిమి గనుక నేనును మావజ్రకంఠుఁడును గలసి యేదో బ్రతుకుతెరు వాలోచించుకొనియెదను. ఇదిగో వాఁ డిచ్చటనే యున్నాఁడు. (అని సమీపించును.)

వజ్ర—(ఏడ్చుచు మందపాలునిఁ గౌఁగిలించుకొని) మన మహారాజుగారిని కృష్ణుఁడు తనపొట్టను పెట్టుకొన్నాఁడురా! అన్నయ్యా!

మంద—మన మిప్పుడు దిక్కుమాలినవార మైనామురా! తమ్ముఁడా!

వజ్ర—ఎల్లప్పుడు నాపాడువేల్పులపంతమే నెగ్గుచున్నదిరా! అన్నయ్యా!

మంద—మననోట శనియుండఁగా మనపంత మెట్లు నెగ్గునురా! తమ్ముఁడా!

వజ్ర—మనుష్యుల నెత్తురు గావలసినంత పానకము త్రావినట్లు గుటగుట త్రాగెడువారము గదా! అన్నయ్యా!

మంద—మొక్కజొన్నపొత్తులవలె నిర్భయముగాఁ గావలసినప్పుడు మనుష్యులను గాల్చుక తినెడువారము గదా! తమ్ముఁడా!

వజ్ర—ఆవైభవమే పోయినదిరా! అన్నయ్యా!

మంద—అప్పుడే పట్టణమంతా పాడుపాటెందిరా! తమ్ముఁడా!

వజ్ర—ఇంతపని చేసినకృష్ణునిఁ గడతేర్చుటకు నుపాయ మాలోచింపవలయును.

మంద—బుద్ధిమంతులము మనమిద్దఱముఁ దలఁచుకొన్నపక్షమున వాఁ డింకఁ బ్రతుకఁగలఁడా?

వజ్ర—అట్లయిన కృష్ణు నేవిధమున మృతినొందింతము?

మంద—నీవు త్రాఁచుపామువై వానిని కఱువుము.

వజ్ర—వెంటనే గరుత్మంతుఁడు నన్నుఁ జీల్చి చంపఁగలఁడు.

మంద—అవునవును. అది వీలులేదు; పోనీ, పులివై వానిఁ గడతేర్పుము.

వజ్ర—అతఁడు నరసింహమూర్తి. అందుచేత నతఁడు పులిమీఁద పుట్ర.

మంద—నిజమా నిజము. అది వలనుపడదు. పోనీ కొండనై నేను వానిమీఁదఁ బడుదునా?

వజ్ర—వాఁడు కొండ గుండఁ జేయఁగలఁడు. గోవర్ధన మెత్తలేదా?

మంద—నిశ్చయమే. ఈయుపాయములు బాగులేవు. ఈదొంగపోట్లు ఏల? కత్తి చేతఁబూని శూరులమై వాని కెదురుగఁ బోయి వధియింతము. మృతినొందుదు మనుభయము లేదు. గఱిక్కుడుప్రాణము. ఎప్పుడు పోయినను పోవును.

వజ్ర—అప్పుడవును. మహారాజుగారే మృతినొందఁగా మన మెంతవారము. ఈకుచ్ఛప్రాణములపై నాశ విడిచి స్వామిభక్తిని జూపుదము. రమ్ము కత్తులఁ బొడ్చుకొందము.

మంద—ఉండు. ఉండు. ఎవరో వచ్చుచున్నారు.

వజ్ర—(చూచి) హా! చచ్చితిని. వాఁడు కృష్ణుని సారథి యగుదారుకుఁడు.

(అంతట దారుకుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

దార—(తనలో) భగవంతుఁడు శ్రీకృష్ణుఁడు నన్నుం బిల్చి, దారుకా! పితృవిహీనుఁ డగుభగదత్తకుమారుని నే నిప్పుడే చూడవలయు. వానికి నారాక నెఱిఁగింపుమని యానతిచ్చె. అతఁ డెందున్నాఁడో తెలిసికొని యిప్పుడే సందేశ మెఱిఁగించెద.

మంద—ఓరీ! వజ్రకంఠా! మన మిప్పుడు పాఱిపోయినను వీఁడు చంపును. పాఱిపోక నిల్చినను వీఁడు చంపును. గతి యేమి?

వజ్ర—వానిమాట కెదురాడకపోయినచో వాఁడు మనలఁ జంపఁడు.

దార—ఓయి! మీ రెవరు? కుమారభగదత్తుఁ డెందున్నవాఁడు?

మంద—(గజగజ వడఁకుచు) మేము నర-నర-నర-నర.

వజ్ర—(గద్గదస్వరముతో) మేము నరకుని బంట్లము కాము.

దార—మీ రింత భయపడనక్కఱలేదు. నేను మీజోలికి రాను. భగదత్తుని జాడఁ దెల్పుఁడు.

వజ్ర—అయ్యా! నరకాసురుఁడు పరమదుర్మార్గుఁడు, కడునీచుఁడు, నీతిహీనుఁడు నగుటచే మే మతని సేవించుటలేదు.

మంద—అయ్యా! భగవంతుఁ డగుశ్రీకృష్ణునకు నరకుఁడు విరోధి యగుటచే వాని సేవించుట మానితిమి.

దార—(తనలో) ఈపిఱికిముండకొడుకులు నాకు వెఱచి యిట్లనుచున్నారు. (ప్రకాశముగా) రాక్షసులకు సయితము నంతటికి యసహ్యము గలిగించు దుర్గుణము లతనియొద్ద యేమియున్నవి.

వజ్ర—ఒకటా, రెండా చెప్ప నలవి గాదు. స్త్రీలఁ జెఱపట్టుట. మహాత్ముల బాధించుట, యాగములకు విఘ్నములు సేయుట, విష్ణుభక్తులను వధించుట మొదలగు పాతకముల ననేకములు చేసెను.

మంద—ఆపాతకుని పేరు మన మిక్కడ తలపెట్టరాదు. కృష్ణుఁడు వానిం జంపి లోకమునకు మేలు చేసెను. వాఁడు తప్పక చావవలసినవాఁడే.

శంబర—కుమారా! అది గాదు. తండ్రి కగ్ని సంస్కారంబు చేసి యుత్తర క్రియలఁ జేయుటయే కార్యపద్ధతి.

భగవ—హా తండ్రీ! భువనైకమల్లా! నీవిషయమయి యిట్టిదారుణవచనంబులు వినవలసె.

మ. అపచారం బొంతెంప నెన్నఁడును నే నాబాల్యము న్నీకు నే
యుపచారంబును నీవు నావలన మున్నొక్కప్పుడుం గోరవై
తివి పుత్రోచితమని గోరఁగాఁ దగునె తండ్రీ యగ్ని సంస్కార మే
యుపచారంబగువేళ వచ్చినదె యయ్యో నాదునిర్భాగ్యతన్. (మూర్ఛిల్లును)

శంబర—కుమారా! ఏమి యీ జాలితనము! (తనలో) ఈతఁడు మాటిమాటికి మూర్ఛిల్లుచున్నాఁడు. ఇతనికి దుఃఖోపశమన మెట్లగును చెప్పుమా? శుక్రశిష్యుల కెంత దురవస్థ సంభవించినది.

[అప్పుడు రాక్షసగురు వగుశుక్రుఁడు ప్రవేశించుచున్నాఁడు]

శుక్రు—(తనలో) అసురులు వేల్పులకన్న నెక్కుడు తేజోవర్ధితు లయినను వారి యైశ్వర్యము వినశ్వర మగుటకుఁ గారణమేమి? (కొంచె మాలోచించి) కారణ మునకయి వెదుకనక్కరలేదు.

మ. సిరి యెల్లప్పుడు ధర్మమూల మనుచుం జెప్పన్ విభుల్. ధర్మత
త్పరుఁడౌ నాతనిభూరివైభవము నిత్యంబై ప్రవర్ధిల్లు, దు
ష్కరుఁడై భ్రష్టము పొందు మానవు మహైశ్వర్యంబు లీభూమికిం
బరువై గట్టి పునాది లేనియిలు తేవం గూలు నొక్కుమ్మడిన్. 7

కావున ధర్మేతరమార్గవర్తనులగుటచే వారికి సిరి యుండదు. ఎట్లయినను వారు నాకు శిష్యులగుటచే వాత్సల్యంబు పెంపున నేను వారిని సమాదరింపక తప్పదు. ఇప్పుడు పితృవియోగదుఃఖితుఁడగు భగవత్తుకుమారుని సమాశ్వాసింపవలయు.

భగవ—(స్మృతిఁ దెచ్చుకొని) తండ్రీ! నీవు లేమి జగమంతయు నంధకార మయమయి యున్నయది. ఏలయన,

తే. గీ. పృథివి యంతయు నేఁడు నిర్వీర మయ్యె
రాజకులమెల్ల నేఁడు నిస్తేజమయ్యె
పరిజనంబెల్ల నేఁడు నిర్గతిక మయ్యె
నీవు లేనిచో ధాత్రి కెట్లు సిరి? 8

శంబర—కుమారా! అదె! నీనిమిత్తము భగవానులగు భార్గవులు వచ్చియున్నారు అభివాదము చేసి సదాచారము నడుపుము.

శంబ—ఈయుద్యమ మనుచిత మయినది.

శుక్ర—ఏమి? నీవు హరితోఁ గయ్యమునకు సన్నద్ధుఁడ వయ్యెదవా ?

భగద—ఆచార్య ! మఱేమి !

ఉ. అంతటివానికిం గొడుకనై, ప్రియశిష్యుఁడనై ధరిత్రి మీ
యంతటివానికిన్, బ్రభువునై దితిసంతతి కెల్ల, నిన్ని నా
ళ్ళింతయశంబుతో నడరి యీసమయంబున బంపనొచ్చు నే
నంతము సేయకుంట తగవా నరకాంతకు నచ్యుతాంతకున్. 13

శుక్ర—ఓయీ! వెఱ్ఱివాఁడా! నీతండ్రికిని నీతండ్రింపలఁ దన్నిన యొక్క-లంపురక్కసులకును నలవిగాని యీపని నీకు సాధ్యమగునా ?

క. ఏమనుకొంటివో నీమది
సామాన్యుఁడు గాఁడు చక్రి సమరంబున నీ
చే మర్దింపఁబడుటకు
నామాటలు వినుము సంధి నడుపుము వత్సా! 14

శంబర—(శుక్రునితో మెల్లఁగా) దేవా! ఈయుద్యమ మెట్లయినమాన్పి దనుజకుల మనుగ్రహింపుము.

శుక్ర—కుమారా! కృష్ణునిప్రభావము వినఁగోరుదు వేని నే నించుక ప్రశంసించెద వినుము. అతఁడు మహీభారావతరణార్థమై యదుకులంబున నవతరించిన హరిగాని మనుజుఁడు గాఁడు. అందుచే నతఁడు,

సీ. పసితనంబున నేలఁ బ్రాక నేర్చిననాఁడె పగరకోటల కెగఁబ్రాక నేర్చెఁ
దిన్నఁగానొక్క విద్దెయును నేరనినాఁడె దితిజులఁ జంపువిద్దెమును నేర్చె
నిల తప్పటడుగులు నిడుట నేరకమున్నె వెసతప్పటడుగులు వెట్ట నేర్చె
నుయ్యాలలం దుండి యుగ్గుత్రాగెడునాఁడె క్రిగ్గాడి యసురుల నుగ్గుచేసెఁ
బాలు గుడుచునప్పుడె నేలపాలు చేసెఁ
బ్రబలదైత్యులఁ బలువురబలము మెఱయ
నతఁడు మాపినకులము లెన్నైనఁ గలవు
వలదువలదన్న హరితోడఁ బగలు మనకు. 15

వెండియు నితఁడు మాయలఁ బ్రయోగించుటయందు నెఱకాఁడు.

శంబర—అవును వైష్ణవం బైనమాయ దుస్తర మని వినుచుందుము.

భగద—పగతుల సాధించుట కితఁడు మాయలనే ప్రయోగించునా ?

శుక్ర—వత్సా ! మఱేమి ? చూడు,

సీ. కెడపెన్ గంసుని, జంపె హంసుని దృటిం గెల్చెన్ జరాసంధునిన్;
బొడిచెన్ బౌండ్రకుఁ, గూల్చె గాలయవనున్, బోకార్చెఁ జేదీశుఁ జ
క్కడచెన్ బూతన, వీరి నందఱను మాయల్ వన్నియే చక్రి మా
పడచెన్ గాని, బలాక్రమస్ఫురణచే నంతంబు నొందించెనే. 16

అవి యన్నియు నేల? నాస్వవిషయమున నే నించుక చెప్పెదవినుము. తొల్లి యతఁడు మహేంద్రరక్షణము చేయ నదితికశ్యపులకు వామనుఁడయి జయించి దీనచింతామణి యగు బలిచక్రవర్తి యొద్దకు నిఱుపేదయట్లు వచ్చి మూఁడడుగుల నేల యాచించె. అప్పుడు నేను,

ఉ. కైటభదైత్యమర్దనుఁడు గాని యితండొక యర్థిగాఁడు మో
మోటము చేత నీవలదు మూఁడడుగు ల్ధర యంచుఁ జెప్పఁడున్
గాటపుటల్కదర్భఁగొని నన్పొడిచెన్ గను లొట్టవోవఁగా
నాఁటికి నేఁటికిం దనయ నా కుడికన్నొటులుండు జూడుమా? 17

భగవ—ఆచార్యా! మీరు చెప్పినదంతయును సహేతుకముగా నున్నయది. అట్లయిన నా కిప్పుడు కర్తవ్యమేమి?

శుక్ర—ఇదిగో నుపదేశించుచున్నాఁడ వినుము.

మ. అభిమానమ్మును జంపుకొమ్ము సమరవ్యాపారము న్మానుకొ
మ్మభయంబిమ్మని నందనందనుని పాదాంభోజము ల్వేఁడికొ
మ్మభిషేకమ్మును జేసికొమ్మవనికిన్ న్యాయంబుగా నేలుకొ
మ్ము భువిం బిమ్మటఁ జూచుకొమ్ము సిరియెప్పుడు న్నీకు నెట్లబ్బునో. 18

శంబ—ఇదియే కర్తవ్యము.

క. అమరుల కాంగిరసుం డెటు
లమరారాతులకు శుక్రుఁ డట్టులె కానన్
సమయోచితంబు లగు నీ
విమలోక్తుల నవధరించి వినుము కుమారా. 19

భగద—భగవానుఁడా! ఓభార్గవా! నీయుపదేశము మా కాదేశము గదా నే నట్లే జేయుదు. కాని పితృమరణమునకుఁ బ్రతిక్రియఁ జేయుట యెప్పుడు?

శుక్ర—సమయ మగునప్పుడు.

తే. గీ. మానసంబున రవ్వులుక్రోధానలంబుఁ
గానఁబడకుండ దిగమ్రింగి కార్యవాది

సమయ మగునప్డు చెలరేఁగి జగము లడలఁ
బైటఁ బడఁదగు నగ్ని పర్వతము వోలె. 20

భగద—ఆచార్యా! మేలు. మీమాట శిరసావహించితి. శంబరా! నీవు పోయి జనకుని యుత్తరక్రియలవిషయమునఁ బ్రయత్నము సేయుము. నే నిప్పుడె కృష్ణునిఁ జూచి వచ్చెదను.

శంబ—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

[అప్పుడు శ్రీకృష్ణుఁడు సత్యభామయుఁ బ్రవేశించుచున్నారు.]

కృష్ణ—దేవి! చిన్ననాఁడు నేను సాందీపునియొద్ద విద్యఁ గఱచునెడ నొక చిన్నబద్దెముఁ జదివితి. దానియాదార్థ్య మిప్పు డెఱింగితిని.

సత్య—అది యేమో యెఱింగించి నాకు వీనులవిందు సేయుదురా?

కృష్ణ—సందేహ మేమి, ఇదిగో విను.

క. ఘనుఁ డైన నల్పుఁ డైనను
జననింద్యం డైన లోకసమ్మతుఁ డైనన్
ధనియైనఁ బేద యైనను
దనతండ్రియె మంచివాఁడు తనయున కెపుడున్. 21

సత్య—దానియాధార్థ్య మెట్లెఱింగితిరి?

కృష్ణ—జగత్కంటకుఁ డగుతండ్రికొఱకు భగదత్తుఁడు మిక్కిలి విలపించుటచే దానిసత్య మెఱింగితి. ఇప్పుడు పితృశోకవిహ్వలుఁడగుభగదత్తుని సమాశ్వాసింపవలయు.

సత్య—దేవా! తండ్రిని జంపి కొడుకు నెట్లూఱడింపఁగలరు. మీకు మోమోటము లేదా?

కృష్ణ—సుందరీ! రాజనీతి మోమోటము నెఱుంగదు. తొల్లి రాఘవుఁడు వాలిం గడతేర్చి యంగదుని యౌవరాజ్యమున నభిషిక్తునిఁజేసి వానికి సేవ్యుండు గాలేదె. అది యటుండనిచ్చి యిటు వినుము.

మ. ఖలునిన్ మాగధుఁ ద్రుంచి తత్తనయునిం గద్దెం బ్రతిష్ఠించితిన్
దురవం గంసునిఁ జంపి నిల్పితిని బంధుల్ మెచ్చ మాతామహున్
బలుగాకి న్నరకు న్వధించితిని గానం బౌత్రుఁ దత్పుత్రునిన్
బలియం బోఁడిరొ రాచపాడి యిది క్రొత్తల్గావు మా కీపనుల్. 22

అదిగో శుక్రాచార్యసమేతుఁడై భగదత్తుఁ డచ్చట నున్నాఁడు.

సత్య—పేరు వినుటయే గాని భార్గవుల నెన్నఁడును దర్శింపలేదు.

కృష్ణ—దేవి! ఇతఁ డసురగురుఁడైనను మహామహిమగలవాఁడు. వందనీయుఁడు.

(ఇద్దఱు నడచుచున్నారు.)

శుక్ర—కుమారా! దేవీసమేతుఁడై వాసుదేవుఁ డిటు వచ్చుచున్నాఁడు. అభివాదము చేసి శరణ మడుగుము.

భగద—చిత్తము. రండు, వారి నెదుర్కొందము.

శుక్ర—జయతు జయతు దేవకీనందన.

కృష్ణ—భార్గవుల కభివాదము సేయుచున్నవాఁడ.

శుక్ర—అనంతకళ్యాణమస్తు. యదుకుంజరా! నీకులమున పితృవిహీనుఁ డగు నీబాలకుఁడు నీకు రక్షణీయుఁడు. వత్సా! భగదత్తా! ఇదె నిన్ననుగ్రహించుటకు భగవంతుఁడు వచ్చియున్నవాఁడు. శరణము వేఁడుము.

కృష్ణ—అపరాధి వధియింపఁబడియె. ఇతఁడు మా కవశ్యము రక్షణీయుఁడు.

భగద—(చేతులు జోడించి) దేవా! నందనందనా!

సీ. తమ్మిచూలిని గన్నతండ్రివయ్యు యశోదయొడిలోన బిడ్డఁడై యున్నవాఁడ
తెలిదీవిపై బాలిదెగడి వ్రేపల్లెలో మందగాపరి వౌచు మన్నవాఁడ
వ్రేలెలందులయిండ్లు వేమారు గొల్లాడి వెన్న మీఁగడఁ జాల దిన్నవాఁడ
తలఁపుల నెక్కించి వలపుల సుక్కించి గొల్లకన్నెలసిగ్గుఁ గొన్నవాఁడ
కమ్మవిలుకాని గడుపారఁ గన్నవాఁడ
వేఁడువారి నేలుదు వంచు విన్నవాఁడ
నన్నుఁ బ్రోవుము నీవాఁడ నన్నవాఁడ
చిన్నవాఁడనో నందుని చిన్నవాఁడ. (అని కాళ్ళపైఁ బడుచున్నాఁడు)

కృష్ణ—కుమారా! లేలెమ్ము. (అని లేవనెత్తి)

మ. అలుకం బూనకుమయ్య నాపయిని నీయాత్మన్ రవంతేనియున్
దలపం దాల్పకుమయ్య నేఁ బగతుఁడం గానయ్య నీ కియ్యెడన్
ఖలుఁడై నీజనకుండు ముజ్జగములం గారించుటం జంపగా
వలసె న్వానిని సేయఁగావలసె దుష్ప్రారంభముల్ నీయెడన్. 24

భగద—దేవా! ఇందు నీ తప్పేమున్నది? నీవుం బగతుఁడై మాతండ్రి స్వయముగా నింత తెచ్చుకొనియె.

కృష్ణ—ఓయీ! వెఱ్ఱివాఁడా! నాకుఁగాదు. లోకమునకు బగతుఁడై యనుము.

శా. నాకుం జుట్టమనంగ దాయయన నున్నాఁడే ప్రపంచంబునన్
లోకద్రోహులు మాకుద్రోహులు జుమీ లోకప్రియుల్ మాప్రియుల్
శ్రీకృష్ణుం డవతార మెత్తెను జగత్క్షేమంకరోత్సాహియై
మీకు న్మికను గీడు సేయుటకు జన్మింపంగలే దిద్ధరన్. 25

శుక్ర—దేవా! నీకుం జుట్టమును బగతురు లేనిమాట నిజమే; కాని నరకుఁడు మీకుఁ జుట్టమును బగతుఁడుఁ గూడ నయ్యె.

సత్య—భార్గవులు లెస్సగా సెలవిచ్చినారు. ఈమహాత్మునకు నరకుఁడు భూమిదేవివలన గొడుకగుటచేఁ జుట్టము. ధర్మద్వేషి యగుటచే వైరి.

కృష్ణ—అది నిజమే. కుమారుఁ డయినను దుష్టుఁ డగుటచే వాత్సల్యము ద్రోసి వాని వధించితిమి

శుక్ర—ఎట్లయినను నరకుఁడు మీచే హతుఁడై ముక్తుఁ డయ్యె.

భగ—నాతండ్రి హరిచేత ముక్తుఁడయ్యె నని నా కిప్పుడు కొంతదుఃఖ ముపశమిల్లినది.

కృష్ణ—వత్సా! భగదత్తా! నీవు లోకానుభవమున కపరిచితుఁడవు గాన నన్యథా భావింపవేని నే నించుక యుపదేశింపఁ దలఁచుచున్నాఁడను.

శుక్ర—ఇది వాని ననుగ్రహించుట.

భగ—ఇందు నే నన్యథా తలఁపవలసిన దేమున్నది?

కృష్ణ—నరుఁ డెంత తేజశ్శాలి యైనను గుణహీనుఁ డయినచో నభ్యుదయము నొందఁడు. దానికి నీతండ్రియే తార్కాణము.

శా. ఆతేజంబున కాబలంబునకుఁ దోడై నీతియే యుండెనా
నీతం డ్రంతటివాఁడు ముజ్జగముల న్నిక్కంబుగా లేఁడు సూ
నీతిభ్రష్టుఁడు గాన నిట్లు చెడెను న్నీతండ్రి నీవున్ సురా
రాతు ల్లోనయి పోకఁ బోక గుణివై ప్రాగ్జ్యోతిషం బేలుమా. 26

శుక్ర—కుమారా! ఈయుపదేశము నీ కనుసరణీయ మయినది.

భగ—ఇది నేను శిరసావహించుచున్నాఁడను.

కృష్ణ—ఇంకను నీ కుపదేశింపఁదగినవి రెండు గలవు. మహానుభావు లగుతపోధనులయెడ వినయవృత్తి నెఱపుము. పరకాంతలయందు మాతృభావము నిలుపుము. వీనియందు ధర్మవిరుద్ధముగా వర్తించుట స్వనాశముం దెచ్చుకొనుటయె.

సీ. ఋషికి నెగ్గొనరించి వృషలుఁడై జనియించె నవనిలో సమవర్తి యంతవాఁడు
మునులచేఁ బల్లకి మోయించి యజగరంబై పడె నహుషునియంతవాఁడు
జడదారి కోకకై సలిపియే శాపోపహతుఁ డయ్యె నమరేంద్రునంతవాఁడు
బ్రహ్మర్షి యల్కకుఁ బాత్రుఁడై నాఁడట్టు లడఁగండె వింధ్యునియంతవాఁడు
కాంతకై చెడె రావణునంతవాఁడు
అతివకై చెడె మీతండ్రియంతవాఁడు
ఎవఁడు సుఖియించెఁ బరకాంతఁ గవయఁగోరి
యెవఁడు వర్ధిల్లె ఋషులకు నెగ్గు చేసి. 27

మఱియు నీ వొక్క ధర్మకార్యమునకు నియోగింపఁదలఁతు. అది యేమందువేని,

కృష్ణు—ఎంతమాట. మహేంద్రునకు నేనా యుపకారము చేయఁగలవాఁడను. ఈజయమునకుఁ గారణము మహేంద్రప్రభావమే.

తే. గీ. అన్న సన్నద్ధుఁడై పోరకున్న నేమి
తమ్ముఁగుఱ్ఱయి గెల్చెఁగా దనుజతతిని
మాపుల నిరంతు లేఁ డన్నమాటె గాని
చంద్రికాంతియు నతని తేజంబు కాదె ? 30

చిత్ర—ఇది కేవల వినయోక్తి.

బృహ—దేవా ! బహుకాశ్రమ తాపసులు తమభక్తి ; విన్నవింపుమని నన్ను మీవద్దకుఁ బుత్తెంచిరి.

మ. శ్రవణానందనముగా వినంబడియె శూరమ్మన్య గర్వాంధుడై
త్యవిభు న్నిఁ పిటఁ జంపినట్టిశుభవార్త ల్తాపసశ్రేణిచే
భువనంబు ల్పదునాలుగుం బడసె సంపూర్ణప్రమోదంబు నీ
భువి నీరక్షన మర్త్య నీకరుణ నుత్ఫుల్లాంబుజాతేక్షణా ! 31

కృష్ణు—దివ్యులయు మహర్షులయు ననుగ్రహముచే నిప్పుడు విజయలక్ష్మీసమేతుఁడ నయితిని.

బృహ—ఇప్పుడు గాదు. ఈవిజయలక్ష్మిని నీవు ద్వారకనుండియే వెంటఁదెచ్చితివి.

చిత్ర—అవునవును.

క. ఇత్తలిరుఁబోఁడిచేఁ గొ
న్నెత్తురులను దొరవునట్టి నీదనుజులన్
మొత్తించుట మొత్తనిపువు
గుత్తులతో రాళ్ల పగులఁగొట్టించుటఁ జూ ! 32

బృహ—దివ్యమనుష్యాంగనలలో నెవ్వరు నీమెకు సరిరారు.

శుక్ర—లావణ్య మున్నచోట పరాక్రమ ముండుట యరిది.

[అప్పుడు భగదత్తుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

భగద—దేవా ! మాతండ్రిచేత బంధింపఁబడినరాజకన్యకల విడిపించితిని. వారందఱు రమానాథుఁడు జగన్నాథుఁడే మాకు నాథుఁ డని మిమ్ముం బరిణయ మగుటకుఁ గోరుచున్నారు.

చిత్ర—ఇది మీకు నిరాకరింపదగినది గాదు

బృహ—జగత్కల్యాణకరునకుఁ గల్యాణము లగుట వింత గాదు.

శుక్ర—ఆకన్య లనుగ్రహింపఁబడుదురు గాక !

కృష్ణు—ఇందు నేను మధ్యస్థుఁడను. సత్యభామయే దానిని నిర్ణయింపవలయును.

సత్య—భరియించువారు మీ రుండ నేను నిర్ణయింపవలసినదేమి ?

కృష్ణు—సపత్నులతో వేగవలసిన దానవు నీవు.

సత్య—ఇందఱు భార్యలతో మీరు వేఁగఁగా సపత్నులతో నే వేఁగఁజాలనా ?

కృష్ణు—భగదత్తుఁడా ! మహర్షి సమక్షమున నందఱ నేను బరిగ్రహించితిని.

చిత్ర—దేవా ! పోవుటకు మా కింక ననుజ్ఞ యిమ్ము.

మ. అవతారంబుల నెత్తి భూభరముఁ దీర్చియు మీనమై కూర్మమై
సువరాహం బయి నారసింహ మయి గుజ్జుం బ్రోడయై మీఁద భా
ర్గవుఁడై రాఘవుఁడై యదుప్రవరుఁడై కల్యాణము ల్గూర్చి యా
దివిజానీకము గాచు వైష్ణవమహాతేజంబు మమ్మేలుతన్. 33

బృహ—దేవా ! నిన్ను నేను గొనియాడఁజాలను ; కాని,

సీ. పాలిమున్నీటు విపుల సీమంతమున లోచు నలరారు నెవ్వాని యనుగుదోయి
బ్రహ్మాండగృహమందు రతనంపుదివ్వెలై కడువెల్గు నెవ్వాని కన్నుదోయి
శ్రితజనంబుల కెల్లఁ జేయూఁతకోలలై తాల్చెడు నెవ్వాని కేలుదోయి
దుష్టనాశము దెల్పు ధూమకేతువు లోచు ముడివడు నెవ్వాని బొమ్మదోయి
యట్టి జగదేకగురునకు నచ్యుతునకు
నాదిమధ్యాంతరహితున కవ్యయునకు
విశ్వమోహనునకు మహావీరునకును
జ్ఞానమయునకు నంజలి నే నొనర్తు. 34

కృష్ణు—దేవతలయు మహర్షులయు నభీప్సితములు సిద్ధించుగాక !

బృహ—జగముల కిదివఱకే యనంతకల్యాణము లైనవి వెండియు నిట్లగుఁగాక !

చ. నెలకును మూడువాన లవనిం దగుఁ బంటలు దెచ్చు రా
జులు ప్రజలం బలెం బ్రజలఁ జూచుకొనం దగుఁ బ్రేమమీఱ నె
పతెఁ దలిదండ్రు లింక దలవంపులఁ దెచ్చెడు చెడ్డబిడ్డలన్
బెలుచన శిక్ష చేయఁదగుఁ బ్రేమముఁ దీర్చి ప్రసన్నయాదవా ! 35

కృష్ణు—తథాస్తు. (అందఱు నిష్క్రమించుచున్నారు.)

సమాప్తము.

